

# చందమామ

జూలై 1993



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు






విడి ప్రతి : 4.00
సంవత్సర చందా : 48.00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'     సంచాలకుడు : నాగిరెడ్డి

## చదివే అలవాటు



వేసవి సెలవులు ముగిసి పాఠశాలలూ, కళాశాలలూ తెరవడంతో నూతన విద్యాసంవత్సరం ఆరంభమయింది. మళ్ళీ పుస్తకాలూ, పాఠ్య ప్రణాళికలూ, పరీక్షలూ అంటూ విద్యార్థులలో హడావుడి మొదలవుతుంది. ఈ సందర్భంలో పుస్తకపఠనం గురించి కాస్త ఆలోచిద్దాం.

మంచి పుస్తకాలు మంచి స్నేహితుల వంటివి. అంతేకాదు; విజ్ఞాన వికాసానికీ, మానసిక ఆనందానికీ పునాది వంటిది పుస్తకపఠనం. పుస్తక ప్రచురణలో మనదేశం ప్రపంచంలో ఎనిమిదవ స్థానంలో ఉన్నది. అంతమాత్రాన ప్రతిభారతీయుడూ పుస్తకాలు చదవడంపట్ల అమితాసక్తిని కనబరుస్తున్నాడని చెప్పలేము. ఎందుకంటే, మనదేశంలో సగటున ఒక పాఠకుడు యేడాదికి 35 పేజీలు మాత్రమే చదువుతున్నాడని ఒక పరిశోధన ద్వారా వెల్లడయింది. మనదేశంలో 1,300 దినపత్రికలూ, దాదాపు 6,000 వారపత్రికలూ, వందలాది మాసపత్రికలూ, ప్రత్యేకసంచికలూ వెలువడుతున్నాయి. అయినప్పటికీ, మనదేశ జనాభాలో సగటున వెయ్యి మందిలో ఒకరికి మాత్రమే రోజూ క్రమం తప్పకుండా వార్తాపత్రిక చదివే అలవాటు ఉన్నది!

బాలబాలికలలో చదివేఅలవాటును పెంపొందించడానికి పాఠశాలలలో గ్రంథాలయాలను నెలకొల్పుతున్నారు. మనదేశంలోని 7,40,000 పాఠశాలలలో దాదాపు 40 శాతం పాఠశాలలలో మాత్రమే గ్రంథాలయాలు ఉన్నాయి. ప్రతి పాఠశాలలోనూ గ్రంథాలయం నెలకొల్పి పిల్లలలో చదివే అలవాటును కలిగించడం, వారి విజ్ఞాన వికాసానికి దోహదం చేస్తుంది. పిల్లలలో చదివే ఆసక్తిని పెంపొందించడం తల్లిదండ్రులూ, ఉపాధ్యాయులూ తమ ప్రధాన బాధ్యతగా గుర్తించి అందుకోసం కృషి చేయడం ఎంతయినా అవసరం.

సంపుటి: 92     జూలై'93     సంచిక:1

విడిప్రతి : 4.00     సంవత్సర చందా : 48.00



ఇప్పుడు పిడిలైట్ అందిస్తోంది వాటర్ కలర్స్ కూడా

పిడిలైట్ ®

# ఫెవిక్రిల్




everest/92/PIL/125 – tl

పిక్సీ ప్యాక్

వేయడానికి సులభం, వినోదానికి వినోదం

A PIDILITE PRODUCT

# 52వ ఆఫ్రికా దేశం




మే 28 వ తేదీ ఐక్యరాజ్య సమితిలో 182వ సభ్య దేశంగా ఎరిట్రియా అనుమతించ బడింది. అంతకు ముందు సరిగ్గా నాలుగు రోజుల క్రితం అంటే — మే 23వ తేదీ ఆదివారం అర్ధరాత్రి సమయంలో రాజధాని అస్మారా నగర వీధుల్లో వేలాదిమంది ఎరిట్రియా ప్రజలు ఆనందోత్సాహాలతో స్వతంత్రగీతాలు ఆలపిస్తూ నాట్యం చేశారు.

ఆనాటి వరకు ఇథియోపియాలో ఉత్తర ప్రాంతంగా ఉన్న ఎరిట్రియా ఆరోజే స్వతంత్ర దేశంగా విడి పోయింది.

ఎరిట్రియాకు సుదీర్ఘమైన చరిత్ర ఉన్నది. అది 7 వ శతాబ్దం వరకు, ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీన రాజ్యంగా చెప్పుకునే ఇథియోపియాలో అంతర్భాగంగా ఉండేది. 16వ శతాబ్ద మధ్యంలో అది టర్కీ దేశస్థుల వశమయింది.

1889 వ సం॥లో అది ఇటలీ పాలిత ప్రాంతమయింది. ఇటలీ నియంత ముసోలినీ 1936 వ సం॥ ఇథియోపియాను ఆక్రమించినప్పుడు ఎరిట్రియాను తన యుద్ధ కార్యకలాపాలకు స్థావరం చేసుకున్నాడు. పదవీచ్యుతుడైన హేలీ సెలాస్సీ చక్రవర్తి, ఇంగ్లాండుకు పారిపోయాడు. 1939 వ సం॥లో ఆరంభమయిన రెండవ ప్రపంచయుద్ధంలో, మిత్రపక్షాలు ఇథియోపియాకు విముక్తి కలిగించి, దానిని మళ్ళీ చక్రవర్తికి అప్పగించాయి. 1941 వ సం॥ ఎరిట్రియా, ఇథియోపియాకు లోబడిన స్వయం ప్రతిపత్తిగల ప్రాంతమయింది.

ఆ తరవాత అక్కడ క్రమంగా వేర్పాటు ఉద్యమాలు తలెత్తసాగాయి. ముఖ్యంగా 1974 వసం॥లో జరిగిన సైనిక తిరుగుబాటులో చక్రవర్తి పదవీచ్యుతుడు కావడంతో, అంతర్యుద్ధం మరింత తీవ్రమయింది. అప్పటికి దేశంలో ఎక్కువ భాగం స్వాతంత్ర్య పోరాటం సాగిస్తున్న గెరిల్లాల కైవసంలో ఉన్నది. లిబరేషన్ గెరిల్లాలకూ , ఇథియోపియా సైనికదళాలకూ మధ్య దాదాపు30 సం॥లు యుద్ధం జరిగింది.

ఆఖరికి 1991 వ సం॥ మే 24 వ తేదీ ఎరిట్రియా రాజధాని అస్మారా 'ఎరిట్రియన్ పీపుల్స్ లిబరేషన్ ఫ్రంట్' (ఇ.పి.ఎల్.ఎఫ్) హస్తగతమయింది. అప్పుడే అది స్వతంత్రం పొందినప్పటికీ సర్వతంత్ర స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకోవడానికి మరొక రెండేళ్ళు పట్టింది.

ఏప్రిల్ 23 - 25 తేదీలలో జరిగిన అభిప్రాయసేకరణలో 99.8 శాతం ప్రజలు ఇథియోపియా నుంచి విడిపోవడానికే మద్దతు తెలిపారు.

ఆ పిమ్మట 'నేషనల్ అసెంబ్లీ' సమావేశమై అంతర్యుద్ధంలో ఇ.పి.ఎల్.ఎఫ్ గెరిల్లాలకు న్యాయకత్వం వహించి, దాని విజయానికి పోరాడిన ఇస్సాయియస్ అఫేవార్కిని అధ్యక్షుడుగా ఎన్నుకున్నది.

134 మంది సభ్యులు గల నేషనల్ అసెంబ్లీలో –ఎరిట్రియా పదిప్రాంతాలు నుంచి ఎన్నుకోబడే ముప్ఫైమంది ప్రతినిధులకూ, 20 మంది ప్రముఖులకూ, 10 మంది స్త్రీ ప్రతినిధులకూ స్థానం కల్పిస్తారు.

ఈ అసెంబ్లీ నాలుగేళ్ళు అధికారంలో ఉంటుంది. అప్పుడొక కమిషన్ ఏర్పాటుచేసి ఆఫ్రికా ఖండంలోని ఈ 52 వ దేశానికి నూతన రాజ్యాంగ శాసనం రూపొందిస్తారు.

ఎరిట్రియా జనాభా దాదాపు 35,00,000. వీరిలో క్రైస్తవులూ, ముస్లింలూ దాదాపు సమానంగా ఉన్నారు. ఇ.పి.ఎల్.ఎఫ్. లో క్రైస్తవులదే పైచేయిగా ఉంటున్నది.

ప్రెసిడెంట్ అఫెవోర్కి మాట్లాడుతూ, "ఎరిట్రియా పునర్జీవనం పొందుతున్న ఇది చాలా ఆనంద కరమైన శుభ తరుణం. ఈ నూతన దేశాభివృద్ధికి ప్రపంచ దేశాలన్నీ సహృదయంతో చేయూత నివ్వాలి," అని తన ఆకాంక్షను తెలియజేశారు.

అంతర్యుద్ధంలో సాహసోపేతంగా పోరాటం సాగించిన 28 సంవత్సరాల సాద్ మహమ్మద్, మే 23వ తేదీ ఎరిట్రియా నూతన పతాకాన్ని అవిష్కరించాడు. సాధారణమైన కాకీ లాగూ, ప్లాస్టిక్ చెప్పులూ, టోపీ ధరించిన ఆ యువకుడు, "ఈ శుభతరుణం కోసం ఎనిమిదేళ్ళు నిర్విరామంగా పోరాడాను. ఈరోజు నా కెంతో, గర్వంగానూ, ఆనందంగానూ ఉన్నది," అన్నాడు.




# ఈశ్వరమ్మ తర్కం

మునిపల్లె గ్రామంలో వుండే ముత్యాలయ్య చాలా సరదా అయిన మనిషి. కబుర్లు బాగా చెబుతాడు. అందరికీ సాయం చేస్తాడు. అయితే, పెళ్ళయ్యాక అన్నీ మానుకోవలసి వచ్చింది. భార్య ఈశ్వరమ్మ కలుపుగోలు మనిషి కాదు సరికదా, అన్నింటినీ అనుమానించి పెడర్థాలు తీస్తుంది. అది చాలదన్నట్లు, ఆమెకు లోభత్వం కూడా వుండడంతో, ముత్యాలయ్య తన పద్ధతులు మార్చుకోక తప్పలేదు. అయినప్పటికీ, ఆయన భార్యలో మంచి మార్పు తేవడానికి ప్రయత్నిస్తూనే వున్నాడు.

ఇలా వుండగా, ఆ ఊరుకు ఏదో పని మీద వచ్చిన సీతారామయ్య వెతుక్కుంటూ, ముత్యాలయ్య ఇంటికి వెళ్ళి, ఆయనతో, "ఎలా వున్నావు? నిజానికి నా పనంతా పక్క ఊళ్ళో వుంది. ఇక్కడ నువ్వున్నావని పని కల్పించుకుని వచ్చాను. నీతో వారం రోజుల పాటు చిన్ననాటి ముచ్చట్లు గుర్తుచేసుకోవాలని వుంది," అన్నాడు.

సీతారామయ్య, ముత్యాలయ్య చిన్ననాటి స్నేహితులు. ముత్యాలయ్యచెప్పేకబుర్లంటే, సీతారామయ్యకు చాలా ఇష్టం. ఆయన చిన్నతనంలో ఎన్నోమార్లు, ముత్యాలయ్యను అవసరానికి ఆదుకున్నాడు. స్వతహాగా భాగ్యవంతుడైన సీతారామయ్య,పెద్దయ్యాక పట్నంవెళ్ళి వ్యాపారం ప్రారంభించి కోట్లకు పడగలెత్తాడు.

సీతారామయ్య రాక, ఈశ్వరమ్మకు నచ్చలేదు. అంత డబ్బున్నవాడు, ఏ పూటకూళ్ళ ఇంట్లోనో దిగక, తమ ఇంట్లో దిగడానిక్కారణం అభిమానం కాదనీ, పిసినిగొట్టుతనమనీ భర్తతో అన్నది. ఒకరోజూ, రెండ్రోజులూ అయితే ఫర్వాలేదు కానీ, వారంరోజులపాటు అడ్డమైన వాళ్ళకూ వండి పెట్టడం తనవల్ల కాదన్నది. పిండివంటలు చేస్తే

"వసుంధర"



వచ్చాను. కానీ అందువల్ల నీకు బోలెడు శ్రమ కలిగించాను. నువ్వు నాకు పెట్టిన భోజనం, ఈ జన్మకు మరచిపోలేను. నీ ఆతిథ్యం నా మిత్రుడి కబుర్లకంటే హాయిగా వుంది. వచ్చేటప్పుడు నా మిత్రుడి కోసం ఒక చిరుకానుక తెచ్చాను. అయితే, వాడి కంటే అది పొందే అర్హత నీకే వుంది," అంటూ ఆమెకొక అందమైన వజ్రపు టుంగరాన్నిచ్చాడు.

ఆ ఉంగరానికొక సీల వుంది. దాన్ని తిప్పుకుని ఏ వేలికైనా సరిపోయేలా చేసుకో వచ్చు. అంత ఖరీదైన ఉంగరాన్ని చూసి నివ్వెర పోయిన ఈశ్వరమ్మకు నోట మాట రాలేదు.

మరిన్ని రోజులు తిష్ఠ వేస్తాడని, రోజూ వండే కూరలు కూడా మానేసి, సీతారామయ్యకు మూడు పూటలూ పచ్చడిమెతుకులే పెట్ట సాగింది.

ఇవేమీ సీతారామయ్య పట్టించుకోనేలేదు. ఆయన రోజంతా బయట తిరిగి పనులు చూసుకునేవాడు. సాయంత్రానికి ఇంటి కొచ్చాక, మిత్రులిద్దరూ అర్ధరాత్రి దాకా ఎడ తెరిపి లేకుండా ఒకటే కబుర్లు చెప్పుకునే వారు. వాళ్ళ వికవికలూ, పకపకలూ చూసి మనసులోనే విపరీతంగా విసుక్కునేది ఈశ్వరమ్మ.

వెళ్ళిపోయే రోజున సీతారామయ్య, ఈశ్వ రమ్మతో, "నేను నా మిత్రుణ్ణి చూడాలని

ఆమె ఉంగరాన్ని పెట్టుకున్నాక సీతా రామయ్య, "మాపట్నంలోచూడదగ్గవింతలు చాలావున్నాయి. మీ దంపతులిద్దరూ పట్నం వచ్చి మా ఇంట్లోనే వుండి, మీకు ఒకసారి ఆతిథ్యం ఇచ్చే అవకాశం మాకివ్వాలి," అని చెప్పాడు.

ఆయన వెళ్ళాక ముత్యాలయ్య, భార్యతో, "నా మిత్రుణ్ణి గురించి నా వద్ద చాటుగా విసుక్కుంటూనే వున్నావు. ఇప్పుడు చూశావా, వాడి అభిమానం! ఇప్పటికైనా నీకర్థ మైందా?" అని అడిగాడు.

ఈశ్వరమ్మ తిరస్కారంగా నవ్వి, "ఆయన మిత్రుడని అమాయకంగా మీరనుకుంటు న్నారు కానీ, ఆయన వ్యాపారస్థుడు. పైగా

పరమలోభి. పక్కఊళ్ళోభాగ్యవంతులువచ్చి వుండేందుకు, ఇంద్రభవనం లాంటి వసతి గృహముంది. అందులో వుంటే మీ మిత్రుడికి చాలా డబ్బే ఖర్చయ్యేది. అందుకని ఆయన తెలివిగా మనింటికొచ్చి మకాం పెట్టి, పైసా ఖర్చు లేకుండా తన పనులు పూర్తి చేసుకున్నాడు. ఆయన వజ్రపుటుంగరాన్ని మనకు కానుకగా ఇచ్చారని మీరనుకుంటున్నారు. అయితే దాన్ని మన ఆతిథ్యానికి వెలకట్టి ఇచ్చాడాయన," అన్నది.

ఆమెకెంతచెప్పినాప్రయోజనముండదని వూరుకున్నాడు, ముత్యాలయ్య. ఆ తర్వాత కొంతకాలానికి ఈశ్వరమ్మకుజబ్బుచేసింది. వైద్యుడు వైద్యం చేశాక, "జబ్బు తగ్గింది కానీ ఇది మళ్ళీ తిరగబెట్టవచ్చు. పట్నంలో ఉమానందుడనే వైద్యుడున్నాడు. మీరాయననుసంప్రతించండి," అనిసలహా ఇచ్చాడు.

"పోనీలే, ఈ విధంగానైనా ఒకసారి మనం పట్నం వెళ్ళి, నా మిత్రుడింట్లో నాలుగు రోజులుండి రావచ్చు," అన్నాడు ముత్యాలయ్య ఉత్సాహంగా.

"మీ మిత్రుడి సంగతి మరిచిపోండి. మనమేపూటకూళ్ళ ఇంట్లోనైనా వుండి పని చూసుకుని వచ్చేద్దాం," అన్నది ఈశ్వరమ్మ.

"అయ్యో, వాడు మననుఆహ్వానించాడన్న విషయం మర్చిపోయావా?" అన్నాడు ముత్యాలయ్య బాధగా.



"ఆయనెందుకాహ్వానించాడను కుంటున్నారు? తను మనకు వజ్రపుటుంగరాన్నిచ్చాడు కదా, అంతటి విలువగలదేమైనా రాబట్టు కోవాలని ఆయన తాపత్రయం. తను భాగ్యవంతుడు కాబట్టి వారం రోజుల భోజనానికి వజ్రపుటుంగరాన్నివ్వగలడు. మనకంత తాహతు లేదు. ఆయన ఇంట్లో దిగితే అంత విలువైన కానుక ఇవ్వాలి. అది మనవల్ల కాదు కాబట్టి మనకు తగ్గ చోట ఏపూట కూళ్ళ ఇంట్లోనైనా వుందాం," అన్నది ఈశ్వరమ్మ.

ముత్యాలయ్యకు భార్య మాటలు నచ్చ లేదు కానీ, చేసేదిలేక వూరుకున్నాడు. ఆ విధంగా ఇద్దరూ పట్నం వెళ్ళి, పూటకూళ్ళ



వాడని నా నమ్మకం. ఏమైతేనేం, ఉమా నందుడి ద్వారా వాడికి మనం వచ్చి వెళ్ళినట్లు తెలిసే వుంటుంది. ఎంత నొచ్చు కున్నాడో ఏమో!" అన్నాడు.

ఇందుకు ఈశ్వరమ్మ, "ఇంటికి అతిథులు రానందు కెవరైనా సంతోషిస్తారు తప్ప నొచ్చు కోరు. మనం వాళ్ళింటికి వెళితే ఆయన మళ్ళీ మనింటికి రావాలి. ఒకసారి కానుక పేరు చెప్పి వజ్రపుటుంగరం ఇచ్చాక, రెండోసారి అంతకంటే తక్కు వదిస్తే బాగుండదు కదా! అందువల్ల మీ మిత్రుడు కూడా మన సంబంధం ఇలా తెగిపోతేనే సంతోషిస్తాడు," అని జవాబి చ్చింది.

ఇంట్లో బస చేసి నాలుగు రోజులుండి, వైద్యుడు ఉమానందుడితో పని పూర్తి చేసుకున్నారు. ఆ సమయంలోనే పట్నం లోని వింతలు, విశేషాలు కూడా చూశారు.

తిరిగి మునిపల్లె చేరుకున్నాక ముత్యా లయ్య, భార్యతో, "చూశావా, పట్నంలో మనకు రెండు వందల వరహాలు ఖర్చ యింది. నా మిత్రుడు సీతారామయ్య ఇంట్లో దిగి వుంటే, వాడికి మంచి కానుక ఇచ్చి వుండేవాళ్ళం. నీ మూర్ఖత్వం వల్ల నేను, నా మిత్రుడికి దూరం కావలసి వచ్చింది. ఉమానందుడికి నా మిత్రుడు బాగా తెలుసునట. వాణ్ణి వెంటబెట్టుకు వెళితే, నిన్ను మరింత శ్రద్ధగా పరీక్ష చేసే

"సీతారామయ్య చిన్నప్పటి నుంచీ తెలుసు నాకు. ఏ ఊరెళ్ళినా ఇష్టులకు కానుకలు తీసుకుని వెళ్ళడం, వాడి అలవాటు. నీకెలా చెప్పాలో నాకర్థం కావ డంలేదు," అని బాధపడ్డాడు ముత్యాలయ్య.

ఆ తర్వాత కొంతకాలానికి సీతారామయ్య అటుగా వచ్చి, పొరుగూరి వసతిభవనంలో దిగినట్టు ముత్యాలయ్యకు తెలిసింది. ఆయన ఎంతో నొచ్చుకుని మిత్రుణ్ణి కలుసుకోవాలనుకున్నాడు. కానీ ఈశ్వరమ్మ అందుకు ఒప్పుకోక, "అంతా నేను చెప్పి నట్లే జరిగింది. మీ మిత్రుడి బుద్ధి బయటపడింది కదా! ఇక ఊరుకోండి," అన్నది.

అయితే, నాలుగు రోజుల తర్వాత సీతా రామయ్య వాళ్ళింటికి వచ్చే సరికి, ఈశ్వరమ్మ ఆశ్చర్యపోయింది.

సీతారామయ్య, మిత్రుడి మీద నిష్ఠూరం వేసి, "మీరు పట్నం వచ్చికూడా మా ఇంటికి రాకపోవడం, నాకెంతో బాధనిపించింది," అని ఈశ్వరమ్మతో, "వీడెలాగూ బుద్ధిలేని గాడిదే! నువ్వయినా నచ్చ చెప్పి వుండా ల్సింది. ఏది ఏమైనా మీ వరస నాకు నచ్చక, ఈసారి మీ ఇంటికి రాలేదు. అర్థ మయిందా?" అన్నాడు.

"మామూలుగా అయితే, మీ ఇంటికొచ్చే వాళ్ళం. నాకు అనారోగ్యంగా వుందప్పుడు. అందుకని మొహమాట పడ్డాం," అన్నది ఈశ్వరమ్మ సంజాయిషీగా.

"మాటలతో సంజాయిషీ ఇచ్చి లాభం లేదు. మరొకసారి పనిగట్టుకుని పట్నం వచ్చి, మా ఇంట్లో కనీసం పది రోజులుండి వెళ్ళండి, అప్పుడే నేను మిమ్మల్ని క్షమి స్తాను. అర్థమయిందా?" అన్నాడు సీతా రామయ్య తల ఆడిస్తూ.

ముత్యాలయ్య, ఈశ్వరమ్మ సరేనన్నట్లు తలలూపారు.

అప్పుడు సీతారామయ్య నవ్వి, "ఇంతకూ నేను మీతో దెబ్బలాడ్డానికి వచ్చాననుకుంటున్నారా? ఇటువైపు వస్తున్నాను కదా అని, నా మిత్రుడి కోసం ఈ చిరుకానుక తెచ్చాను," అంటూ ముత్యాలయ్యకు ఒక విలువయిన వజ్రపుటుంగరాన్నిచ్చి వెళ్ళి పోయాడు.

ఈశ్వరమ్మ తెల్లబోయింది.కానుకఇవ్వాల్సి వుంటుందని, తను పట్నం వెళ్ళినా సీతా రామయ్య ఇంట్లో దిగలేదు. తమ ఇంట్లో దిగక పోయినా కానుక ఇచ్చి వెళ్ళాడు సీతారామయ్య. కానుకలు వ్యాపారం కాదు; అవి అభిమానం, ఆప్యాయతలకు నిద ర్శనాలు. కొంత ఆలస్యంగా అయినా ఈ సత్యాన్ని గ్రహించిన ఈశ్వరమ్మ, కొన్నాళ్ళ తర్వాత సీతారామయ్య ఇంట్లో దిగడానికే భర్తను పట్నానికి ప్రయాణం కట్టించి, వెంట మంచి కానుకలు కూడా తీసుకుని వెళ్ళింది.



# అనుమతిపత్రం

హేలాపురి అడవుల్లో వేటాడేవాళ్ళు ఎక్కువైపోయారు. దానితో జంతువుల సంఖ్య తరిగి పోసాగింది. ఇది తెలుసుకున్న రాజు విద్యాధరుడు, అడవుల్లో జంతువుల్ని వేటాడడానికి అనుమతి పత్రాలు కావాలనీ, అది లేనివాళ్ళు కఠినంగా శిక్షింప బడతారనీ శాసనం చేశాడు.

ఒకనాడు ఇద్దరు వేటగాళ్ళు అడవిలో జంతువుల్ని వేటాడుతున్నారు. అకస్మాత్తుగా తనిఖీ అధికారులు అడవిలో ప్రవేశించి, వాళ్ళను రాజముద్రిక వున్న తనిఖీ అనుమతి పత్రాలను చూపించమన్నారు. ఆ మాట వింటూనే ఒక వేటగాడు పరుగు లంకించుకున్నాడు. అధికారులు రెండవవాణ్ణి అక్కడే వదలి, పారిపోతున్న వాడివెంట పడ్డారు.

అడవిలో చాలాదూరం పరిగెత్తిన తర్వాత, వేటగాడు తనిఖీ అధికారులకు దొరికి పోయాడు. వాడు ఆయాసంతో ఒగర్చుతూ, దుస్తుల్లోంచి అనుమతిపత్రం తీసి అధికారులకు చూపించాడు.

రాజముద్రిక వున్న అనుమతిపత్రాన్ని పరిశీలించిన అధికారులు, వేటగాణ్ణి, "చంపావు కదయ్యా! అనుమతిపత్రం వుంచుకుని ఇంతదూరం ఎందుకు పరిగెత్తావు? మాచేత ఎందుకు పరుగులు తీయించావు," అని అడిగారు కోపంగా.

అందుకు వేటగాడు, "నాదగ్గిర అనుమతిపత్రం వున్నదిగాని, నా మిత్రుడి దగ్గిర లేదు!" - అన్నాడు మరింతగా ఆయాసపడుతూ.

— కోనే నాగవెంకట ఆంజనేయులు






## 4

[మాణిక్యపురి దక్షిణప్రాంత సముద్రతీర గ్రామాలు కొన్ని హఠాత్తుగా నేలమట్టం కావడంతో, భయభ్రాంతులై పారిపోయి వచ్చిన కొందరు ప్రజలు రాజధానీనగరం చేరారు. రాజూ, యువరాణీ, సేనాధిపతీ వారికి ఆశ్రయం కల్పించే ఏర్పాట్లలో నిమగ్నులయ్యారు. సముద్రం నుంచి వచ్చిన ఒక రాకాసిమృగమే ఆ బీభత్సాన్ని సృష్టించిందని దళనాయకుడు, సేనాధిపతికి చెప్పాడు. —తరవాత]

సేనాధిపతి గంభీరసింహుడు హుటాహుటిగా రాజభవనానికి వెళ్ళి, దళనాయకుడు వీరసింహుడు చెప్పిన విషయాన్ని రాజుకు తెలియజేశాడు. ఆ సంగతి విన్న రాజు ప్రతాపవర్మ, "ఏమిటీ! రాకాసి మృగమా? చరిత్రకు అందని కాలంలో ఎప్పుడో ఉండేవని చెప్పుకునే రాకాసి మృగాలు ఈ కాలంలో ఉండడం అసంభవం. గ్రామాలకు గ్రామాలు నేల మట్టమైపోయి, ప్రజలు ప్రాణభీతితో పారిపోతున్న మాట నిజమేకావచ్చు. అయితే ఆ బీభాత్సానికి కారణం ఏదో రాకాసిమృగం అంటే నమ్మశక్యం కాకుండా ఉన్నది. ఇంతకూ, ఆ మృగాన్ని కళ్ళారా చూసిన వాళ్ళు ఇక్కడికి ఎవరూ రాలేదు. సైనికులు చెప్పిన విషయాన్ని దళనాయకుడు నీకు చెప్పాడు. కాబట్టి వాళ్ళ మాటలు ఎంత వరకు నిజమో ఆలోచించాలి," అన్నాడు.



"మంచిది. అలాగే వెళ్ళిరా. నువ్వు వచ్చేలోగా నేను రాజగురువును పిలిపించి, ఏంచేయాలో ఆలోచిస్తాను. మునుముందు ఈ విషయంలో మనం రాజగురువు సలహాను పాటించడం శ్రేయస్కరం," అన్నాడు రాజు.

"చిత్తం, మహారాజా!" అని అక్కడి నుంచి బయలుదేరిన సేనాధిపతి, శరణార్థులుగా వచ్చిన స్త్రీలూ, పిల్లలూ, తలదాచుకున్న రాజప్రాసాదం పడమటి భాగానికి వెళ్ళాడు. సేనాధిపతిని చూడగానే, అక్కడి కాపలాభటులు, అతనికి గౌరవంగా నమస్కరించి, "అంతా సక్రమంగా జరిగిపోతున్నది ప్రభూ! ఇక్కడ సమస్యలేవీ లేవు. ఇక్కడి శరణార్థులను చూడడానికి మన యువరాణిగారు కూడా ఇప్పుడే వచ్చారు," అని చెప్పారు.

గంభీరసింహుడు గుర్రందిగి, రెండు వైపులా పెద్ద పెద్ద రాతి స్తంభాలున్న విశాలమైన మంటపంలోకి అడుగు పెట్టాడు. అప్పుడు పక్క గదిలోనుంచి మామూలు దుస్తులలో వున్న యువరాణి ప్రియంవద ఇద్దరు చెలికత్తెలతో వెలుపలికి వచ్చింది. సేనాధిపతిని చూడగానే ఆమె, "ఇక్కడున్న వారికి ఆహార పానీయాలకు ఎటువంటి కొరతా లేదు. పసిపిల్లలకు ఎటువంటి అనారోగ్యమూ కలగకుండా తగిన ముందు జాగ్రత్తలు తీసుకోమని ఆస్థాన వైద్యులకు

"నిజమే, ప్రభూ! దళనాయకుడు వీరసింహుడు నేలమట్టమైన గ్రామాలను చూశాడే తప్ప, రాకాసిమృగాన్ని చూడలేదు. అయితే, గ్రామాలకు గ్రామాలు అలా నాశనమై పోవడానికి మరే ప్రకృతి వైపరీత్యం జరగలేదని తెలుస్తూనే ఉన్నది. కాబట్టి, ఆ రాకాసిమృగాన్నిచూశామని చెప్పే మన సైనికుల మాటలను ఆధారరహితం అని తోసివేయడానికి లేదని నాకనిపిస్తున్నది. తమరు అనుమతించారంటే ఈ రాత్రికి నేనే, ఆ స్థలానికి స్వయంగా బయలుదేరి వెళ్ళి, అసలు అక్కడ ఏం జరిగిందో తెలుసుకుని వస్తాను," అన్నాడు సేనాధిపతి గంభీరసింహుడు వినయంగా.

చెప్పాను. పసిపిల్లల ఆరోగ్యాన్ని అలక్ష్యం చేయకూడదు కదా," అన్నది.

"చాలా సంతోషం, యువరాణీ! పసి పిల్లల క్షేమంపట్ల తమరు చూపుతూన్న శ్రద్ధ ప్రశంసనీయమైనది. ప్రతివిషయం లోనూ ముందుజాగ్రత్తతో వ్యవహరించడం అన్ని విధాలా మంచిది," అన్నాడు సేనాధిపతి.

"ఇక్కడి స్త్రీలు, సుఖంగానే ఉన్నారు గాని, తమ భర్తల మీదబెంగతో ఉన్నారు. కాబట్టి దూరంగా వున్న పురుషులు ఒకసారి వచ్చి, వాళ్ళ భార్యాబిడ్డలను చూసే ఏర్పాటు చేసినట్టయితే బావుంటుంది," అన్నదియువ రాణి.

"అలాగే, యువరాణీ! రేపు సాయం కాలానికి కొందరిని పంపే ఏర్పాటు చేస్తాను," అని చెప్పి సేనాధిపతి అక్కడి నుంచి శరణార్థులున్న వేరొక శిబిరానికి బయలుదేరాడు.

అంతలో దళనాయకుడు వీరసిం హుడు ఎదురుపడి నమస్కరించి, "ఈ రోజు మరికొందరు సైనికులు గాయాలతో తిరిగి వచ్చారు. వారికి మన వైద్యులు చికిత్స చేస్తున్నారు. అయినా, వాళ్ళకు ప్రాణ భయం పట్టుకున్నది. హడలిపోయి, ఎప్పుడూ రాకాసి మృగం గురించే పలవరిస్తున్నారు," అన్నాడు..

"వాళ్ళ మాటలే గనక నిజమైనట్టయితే, మనరాజ్యం ఇప్పుడు భయంకరమైన ఆపద పాలవడం ఖాయం. కాబట్టి దానిని ఎదుర్కోవడానికి ఇతరుల సాయం కూడా





కోరవలసి రావచ్చు. దేనికైనా ఆ రాకాసిమృగం గురించిన విషయాలు ప్రత్యక్షంగా తెలుసుకోవడం అవసరం. అందువల్ల నేనే స్వయంగా మనరాజ్యం దక్షిణప్రాంతానికి వెళుతున్నాను. నువ్వూ నాతోపాటు రావాలి. సాయంకాలాని కల్లా సిద్ధం కావాలి," అని ఆజ్ఞాపించాడు సేనాధిపతి.

" చిత్తం! సైనికదళాన్ని కూడా మన వెంట తీసుకుని వెళదామా, ప్రభూ?" అని అడిగాడు దళనాయకుడు చాలా ఉత్సాహంగా.

"వద్దు. నీతో పాటు మరో ముగ్గురు సైనికులు వస్తే చాలు. అయితే, ఈ రాత్రి కాపలాకు వెళ్ళ వలసిన సైనికదళాన్ని యథాప్రకారం వెళ్ళనివ్వు. మనం విడిగా వెళదాం. మన ప్రయాణ విషయం మరెవ్వరికీ తెలియ కూడదు," అన్నాడు సేనాధిపతి.

ఆ రోజు మధ్యాన్నం, సేనాధిపతీ, దళనాయకుడూ మరి ముగ్గురు సైనికులూ గుర్రాల మీద మాణిక్యపురి దక్షిణ సరిహద్దులకు బయలు దేరారు. సాయంకాలానికి సముద్రతీరం చేరుకున్నారు.

అక్కడి గ్రామాలన్నీ నేలమట్ట మైపోయి, చెట్టు చేమలు కూడా నాశనమై పోయి కనిపించాయి. నిర్మానుష్యంగా ఉన్న గ్రామాలకు కాపలా కాస్తున్న భటులు వాళ్ళకు ఎదురుపడి నమస్కరించారు. సేనాధిపతీ, దళనాయకుడూ వాళ్ళను దాటుకుని వెళ్ళి సముద్రతీరం లోని ఇసుక మీద అడుగుజాడ లేవైనా కనిపిస్తాయేమో నని జాగ్రత్తగా పరిశీలించసాగారు. ఒకచోట దేనినో నేలమీద లాక్కుని వెళ్ళినట్టు సమాంతరంగా రెండు విశాలమైన చారలు కనిపించాయి. ఆ చారలు సముద్ర జలం దగ్గరి నుంచి ఆరంభమై ఉత్తర దిశగా చాలా దూరం వరకు కనిపించాయి. ఆ చారల మధ్య అక్కడక్కడ కొన్ని ఖాళీలు కనిపించాయి. సముద్రం నీటికి సమీపంలో, తడిగా ఉన్న ఇసుక మీద ఆచారలకు బదులు రెండు

పెద్ద పాదాల గుర్తులు కనిపించడంతో దళనాయకుడు వాటిని సేనాధిపతికి చూపుతూ, "సముద్రంలో నుంచి ఏదో పెద్దప్రాణి బయటికి వచ్చిందనడంలో ఇసుమంత సందేహం కూడా లేదు ప్రభూ!" అన్నాడు.

"అవును! సముద్రం నుంచి వచ్చిన ఆ వింత ప్రాణి మళ్ళీ సముద్రం లోపలికే చేరి ఉండాలి. ఈ చారలు ఉత్తరదిశగా మాత్రమే వెళ్ళడం గమనించావా?" అని అడిగాడు సేనాధిపతి.

"నిజమే ప్రభూ!" అంటూ దళనాయకుడు మరేవైనా గుర్తులు కనిపిస్తాయేమోనని సముద్రతీరమంతా జాగ్రత్తగా పరిశీలించి చూడసాగాడు.

కొంతసేపటికి చీకటి పడింది. ఆ తరవాత ఏదీ స్పష్టంగా కనిపించలేదు. ఆ రాత్రి వాళ్ళు, కాపలా ఉన్న భటులకు కొద్ది దూరంలో గడపాలని నిశ్చయించారు. ఆ సంగతి కాపలా ఉన్న భటులకు కూడా తెలియదు.

అర్ధరాత్రి దాటింది. ఒక వైపున సముద్రం, మరొక వైపున విశాలమైన ఇసుక మైదానం. ఆకాశంలో అక్కడక్కడ మెరుస్తూన్న చుక్కలు తప్ప మరేదీ కనిపించడంలేదు.

నాలగవ జాము ఆరంభం కాగానే సేనాధిపతికి ఉత్తర దిశలో చీకటికొండలా



ఏదో ఒక ఆకారం కదలడం కనిపించింది. అది క్రమంగా తమకేసి రావడం అతడు గమనించి, దళనాయకుడికి చూపాడు. అది మెల్లగా కదులుతూ ముందుకు వస్తున్నది. అటూ ఇటూ కదులుతున్న దాని తల, ఎత్తయిన చెట్లకు పైన కనిపించింది. అది ఇంకా ముందుకు రావడంతో దాని భీకరమైన రూపం మరింత స్పష్టంగా కనిపించింది. అయితే, అది ఏమాత్రం శబ్దం చేయడం లేదు. తాడిచెట్ల వంటి కాళ్ళూ, కొండచిలువల వంటి చేతులూ గల అతిభీకరమైన ఆ రాకాసిమృగం రూపం సేనాధిపతికి సైతం మనస్సులో భయం పుట్టించింది!



సేనాధిపతీ, దళనాయకుడూ ఆ రాకాసి మృగం మార్గానికి అడ్డు పడకుండా ఎంతో జాగ్రత్తగా పక్కకు తప్పుకున్నారు. అదృష్ట వశాత్తు వారి వెంట వచ్చిన సైనికులు కూడా దాని పాదాల కింద పడకుండా తప్పించుకున్నారు.

తూరుపు దిక్కున అరుణ రేఖలు ఉద యిస్తూండగా ఆ రాకాసిమృగం సముద్రం లోకి దిగి అలాగే లోపలికి వెళ్ళి పోయింది!

సేనాధిపతికి, నడుస్తున్న పర్వతం లాగా ఉన్న ఆ రాకాసిమృగాన్ని చూస్తూంటే, మానవమాత్రు లెవరూ దానిని ఎదుర్కో లేరనిపించింది. భయంకరమైన ఆ వింత ప్రాణి ఏ అర్ధరాత్రి సమయంలోనో సముద్రం నుంచి వెలుపలికి వచ్చి, ఉత్తరదిశగా వెళ్ళి, సూర్యోదయం కల్లా వెనుదిరిగి సముద్రం చేరుతుందన్న విషయం రూఢి అయింది. దాని నెవరూ ఎదుర్కోలేరు కాబట్టి, తమవెంట వచ్చిన ముగ్గురు సైనికులను, రాజధానికి తిరిగి వెళ్ళమని సేనాధిపతి అజ్ఞాపించాడు. కాపలా కాయడానికి అక్కడికి అంతకు ముందు వచ్చిన సైనికుల జాడ కనిపించ లేదు. వాళ్ళు రాత్రి వచ్చిన ఆ రాకాసి మృగం పాదాల కిందపడిప్రాణాలు కోల్పోయి ఉంటారని సేనాధిపతి గ్రహించాడు.

"ఆ రాకాసిమృగాన్ని ఎదుర్కొని, మన ప్రాణాలనూ, సైనికుల ప్రాణాలనూ పోగొట్టు కోవడం వివేకం కాదు ప్రభూ! అంతకన్నా, ఆ రాకాసిమృగం మన రాజ్యంలోకి జొరబడి నాశనం చేయకుండా జాగ్రత్త పడడం క్షేమం, అనుకుంటాను," అన్నాడు దళ నాయకుడు.

"నిజమే. అది మనరాజ్యంలో అడుగు పెట్టకుండా చేసే పథకం ఏదో ఆలో చించాలి. వీలయితే, దానిని హతమార్చే ఉపాయం కూడా ఆలోచించాలి. మనం ఇప్పుడే రాజధానికి వెళ్ళి రాజుగారితో విషయం చెప్పాలి. ఈ రాత్రికి మన భటుల నెవ్వరినీ కాపలాకు పంపవద్దు. రేపు తెల్లవారాక నువ్వు ఒకసారి ఇక్కడికి వచ్చి ఆ రాకాసిమృగం అడుగు జాడలు మరె

క్కడయినా కనిపిస్తాయేమో చూసి రా," అంటూ సేనాధిపతి గుర్రం మీదికి ఎక్కాడు.

మరొక గుర్రం మీద దళనాయకుడు బయలు దేరాడు. ఇద్దరూ శరవేగంతో రాజధానీ నగరం చేరుకున్నారు.

సేనాధిపతి రాజప్రాసాదం చేరే సరికి, అక్కడ రాజు ప్రతాపవర్మ, రాజగురువు గౌరీనాథుడితో ఏదో తీవ్రంగాచర్చిస్తున్నాడు. ఆయన సేనాధిపతిని చూడగానే, "ఆ వింత ప్రాణిని చూశావా?" అని అడిగాడు చాలా ఆదుర్దాగా.

"చూశాను ప్రభూ! సైనికుల మాటలలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. అది తప్పక రాకాసిమృగమే!" అంటూ సేనాధిపతి తాను దక్షిణ సముద్ర తీరంలో చూసిన దృశ్యాన్ని వివరించి, "ఆ రాకాసిమృగం అర్ధరాత్రి సమయంలో సముద్రం నుంచి వెలుపలికి వచ్చి, తిన్నగా ఉత్తరదిశకు వెళ్ళి, తెల్ల వారేలోగా మళ్ళీ సముద్రం చేరుతున్నది. అతి భీకరమైన ఆ రాకాసి మృగాన్ని చంప గల శక్తివంతులు మనలో ఎవరూ లేరు!" అన్నాడు.

ఆ మాటలు విని రాజు మౌనంగా ఆలోచించ సాగాడు.

అప్పుడు రాజగురువు, "మహారాజా! పూజారి కులశ్రేష్ఠుడి శాపానికి గురైన చంద్రకేతు, ఈ రాకాసిమృగం రూపంలో



తిరుగుతున్నా డేమో అన్న అనుమానం నాకు కలుగు తున్నది. ఎందుకంటే చాలా అరుదుగా పూచే 'శతాబ్దిక' ఇప్పుడు మన రాజ్యానికి ఉత్తరదిశలో పూచి ఉన్నది. ఆ విచిత్రపుష్పం కోసమే రాకాసిమృగం రూపం లోవున్న చంద్రకేతు అక్కడికి ఆకర్షింప బడుతున్నాడని నాకనిపిస్తున్నది. కాబట్టి ప్రస్తుతం ఆ 'శతాబ్దిక' పుష్పాలే మనల్ని కాపాడాలి!" అన్నాడు.

"మనకు అరిష్ట దాయకాలని తమరు సెలవిచ్చిన ఆ విచిత్ర పుష్పాలే, ఇప్పుడు మనల్ని ఈ ఆపదనుంచి కాపాడగలవా? అదెలా సంభవం గురుదేవా?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"పూజారి శాపానికి గురై ఈ భూమి మీద చోటులేకుండా పోయిన చంద్రకేతును ప్రస్తుతం ఆ విచిత్ర పుష్పాలే మాణిక్యపురికి ఆకర్షిస్తున్నాయి. ఆ విచిత్ర పుష్పాలను, మనం ఆ రాకాసిమృగం అంటే, చంద్రకేతు ఉంటున్న సముద్ర మధ్యానికే చేర్చామంటే, ఆ నరరూప రాక్షసుడు ఇటువైపు వచ్చే అపాయం తప్పుతుంది కదా? అయితే ఆ సాహస కృత్యం చేయగల సమర్థులయిన వీరు లెవరో చూడాలి!" అన్నాడు రాజగురువు.

ఆ మాటలతో రాజుకు శృంగ్మాయ్ కొండలలో నివసించే ఉత్తుంగజాతి ప్రజలు గుర్తుకు వచ్చారు. వసంతోత్స వాలకు వచ్చి, వివిధ పోటీలలో గెలు పొందిన ఉత్తుంగుడనే యువకుడూ, అతడి మిత్రులూ తనను అక్కడికి ఆహ్వానించిన విషయం రాజు మనసులో మెదిలింది. ఆ విచిత్ర పుష్పాలను యువరాణికి కానుకగా ఇచ్చింది ఉత్తుంగుడే కాబట్టి, అతన్ని ఈ విషయంలో ఉపయోగించు కోవడం ఒక్కటే రాజుకు తరుణోపాయంగా తోచింది. కొంతసేపు దీర్ఘంగా ఆలోచించి ఆయన తల పంకించి, సేనాధిపతి కేసి తిరిగి, "నేను మన రాజ్య రక్షణ కోసం రేపే శృంగ్మాయ్ కొండలకు బయలుదేరు తున్నాను. నా వెంట దళనాయకుడు వీరసింహుడు. ఒక్కడు వస్తే చాలు. అతడు ఇంతకు పూర్వమే ఒకసారి ఆ ప్రాంతానికి వెళ్ళి వచ్చాడు. మేము తిరిగి వచ్చేవరకు ఇక్కడి శరణార్థులకు ఎటువంటి కొరతా లేకుండా చూసుకోవడం నీ బాధ్యత!" అని, రాజగురువు కేసి తిరిగి, "నా ప్రయాణం, విజయవంతం కావాలని ఆశీర్వదించండి, గురుదేవా!" అని నమస్కరించాడు.

"ప్రజలను రక్షించడానికి చక్కని నిర్ణయం తీసుకున్నావు, నాయనా! రాజ్య రక్షణ కోసం ప్రాణత్యాగం చేయడానికి సిద్ధపడే సాహసవీరులు ఉత్తుంగజాతి ప్రజలు! నీకు తప్పక విజయం సిద్ధిస్తుంది. లైరంబీమాత నీకు తోడుగా ఉండి నిన్నూ, నీ ప్రజలనూ రక్షించుగాక!" అని ఆశీర్వ దించాడు రాజగురువు.— (ఇంకావుంది)






# అజేయుడి ఓటమి!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఒక దేశానికి పాలకుడివైన నువ్వు, భీతి కొలిపే ఈ శ్మశానంలో ఇంత అర్ధరాత్రి వేళ ఎనలేని ఇక్కట్లకు గురికావడం చూస్తూంటే జాలి కలుగుతున్నది. ఆశాపాశం ఎంత నిడివైనదో ఊహించడం అసాధ్యమంటారు పండితులు. మనిషి మనస్సు ప్రలోభాల పుట్ట అన్న సత్యం నీకు తెలియంది కాదు. నువ్వు ఎంతో పట్టుదలా, ఓర్పులతో పాటు; నిగ్రహశక్తీ, శాంతగుణం కలవాడివన్న మాట నిజం. ఐతే, నువ్వు సాధించ దలచిన కార్యం ఏదైనా — ఆఖరి క్షణంలో ఏ ప్రలోభానికో లొంగిపోయి, నీ సుగుణాలన్నిటికీ స్వస్తి పలుకుతావేమో అన్న శంక నాకు

## బేతాళ కథలు



కలుగు తున్నది. ఈ విషయంలో నువ్వు తగు జాగ్రత్తలో వుండేందుకు గాను, వేదాంతీ, తపశ్శక్తి సంపన్నుడూ అయిన అజేయుడనే యువరాజు, రాజ్యకాంక్ష అనే ప్రలోభానికి ఎలా వశుడై పోయాడో చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

అరుణగిరి మహారాజు విక్రమసేనుడికి అజేయుడు, విజయుడు అని ఇద్దరు కుమారులు. మొదటి నుంచీ అజేయుడిది వేదాంత ధోరణి. అయితే, విజయుడిలో ఇంతింతనరాని రాజ్యకాంక్ష వుండేది.

పదహారేళ్ళ వయసులోనే అజేయుడు సకలవిద్యాపారంగతు డయ్యాడు. తండ్రి అతడిని యువరాజుగా ప్రకటించాలనుకున్నాడు. ఇందుకు విజయుడు అభ్యంతరం చెబుతూ, "అజేయుడు నాకంటే పెద్దవాడే కావచ్చు. కానీ, రాజ్యాన్నేలడానికి పనికిరాడు. అతడిది వేదాంత ధోరణి!" అన్నాడు తండ్రితో.

ఆసమయంలో అక్కడే వున్న అజేయుడు, "వేదాంతి అయిన జనక మహారాజు చక్కగా రాజ్య పాలన చేశాడు. నువ్వు కూడా వేదాంతం కొంతయినా తెలుసుకో. ఎంతో మంచిది," అన్నాడు.

"ఏదైనా కొంచెం కొంచెం నేర్చుకోవడం నాకిష్టముండదు. అయినా, రాజ్యకాంక్ష చావని నువ్వేం వేదాంతివి?" అన్నాడు విజయుడు నిష్ఠూరంగా.

దీనికి అజేయుడు నవ్వి, "నేను వేదాంతినని అన్నానా? ఆమాట నువ్వే అన్నావు. మళ్ళీ నువ్వే కాదంటున్నావు. నాకు రాజ్యకాంక్ష వుందన్నావు. నాన్న నన్ను యువరాజును చేస్తానంటున్నాడు. ఇక అభ్యంతరం దేనికి?" అన్నాడు.

రాజు విక్రమసేనుడు, విజయుడి భుజం తట్టి, "నాయనా! మాటల్లో నువ్వు అజేయుడిని గెలవలేవు. మీరిద్దరూ రామలక్ష్మణుల్లా అన్యోన్యంగా వుండాలని నా కోరిక. రాజ్యకాంక్ష నీకు తగనిది. ఎందుకంటే-పెద్దవాడు రాజు కావడం న్యాయమూ, సంప్రదాయమూనూ!" అన్నాడు..

“నాకు సమర్థత మీదనే తప్ప సంప్ర దాయం మీద నమ్మకం లేదు,” అన్నాడు విజయుడు.

ఇందుకు అజేయుడు, “నీకు సంప్ర దాయం మీద కొంత నమ్మకముంది. అందువల్లనే యువరాజు కావడానికి నాతో పోటీ పడుతున్నావు. నువ్వు నిజంగా సమర్థతను నమ్మే పక్షంలో, మన మిద్దరం దేశంలోని యువకు లందరితోనూ పోటీ పడాలి,” అన్నాడు.

దీనికేం బదులివ్వాలో తెలియక విజ యుడు తెల్లమొహం వేశాడు. అజేయుడు, తమ్ముడి భుజం తట్టి, “అందుకే నిన్ను కొంతయినా వేదాంతం నేర్చుకోమని చెప్పాను. తర్కం తెలుస్తుంది,” అన్నాడు.

విజయుడు చిరాగ్గా, “రాజుకు భుజ బలం ముఖ్యం. తర్కానికి మంత్రులుం టారు. యుద్ధవిద్యలలో నేను నిన్నోడిస్తాను. ఆపైన ఎవరిని రాజును చేయాలో పెద్దలు నిర్ణయిస్తారు,” అన్నాడు.

అజేయు డిందు కంగీకరించాడు. అయితే, విజయుడికింకా అన్ని విద్యల లోనూ పరిపూర్ణత లేదు. పోటీ విషయంలో ఇంకో రెండు సంవత్సరాలు ఆగడం మంచిదని అజేయుడన్నాడు.

ఈ రెండు సంవత్సరాలలోనూ విజ యుడు చెప్పలేనంత కృషి చేసి, అన్ని యుద్ధవిద్యలలోనూ గురువుల చేత



పొగడ్తలందుకున్నాడు. తర్వాత ఒకనాడు అజేయుడితో పోటీకి దిగి, అన్నింటిలోనూ చిత్తుగా ఓడిపోయాడు.

ఇంత జరిగాక విజయుడాశ్చర్యపడి, “యుద్ధవిద్యల్లో ఇంతగా ఆరితేరినవాడివి! నీకు రాజ్యకాంక్ష లేదంటే నమ్మడం ఎలా?” అన్నాడు.

“సమర్థత, నిస్వార్థగుణం, వేదాంత ధోరణి — ఈ మూడూ సమపాళ్ళలో కలిసి నపుడే ఎవడైనా ఆదర్శ ప్రభువు కాగలుగు తాడు. నాకు రాజ్యకాంక్ష లేదు. కానీ నేను రాజునైతే నాన్న సంతోషిస్తాడు. ప్రజలు సుఖపడతారు. అందుకే నేనురాజును కావా లనుకుంటున్నాను,” అన్నాడుఅజేయుడు.



విక్రమసేనుడు, అజేయుడిని రాజుగా ప్రకటించాలని తుదినిర్ణయం తీసుకున్నాడు. విజయుడు మళ్ళీ అభ్యంతరం పెట్టాడు. తండ్రి లెక్కచేయ లేదు. అప్పుడతడు తల్లి వద్దకు వెళ్ళి, "అమ్మా! నాకు రాజును కావాలని బలమైన కోరిక వుంది. అది తీరకపోతే ఏదో ఒక రోజున, నేను రాజద్రోహం చేయగలను. అన్నయ్య కెలాగూ రాజ్యకాంక్షలేదు. నాన్న నన్నెందుకు రాజును చెయ్యడు?" అని అడిగాడు.

"రాజద్రోహం చేస్తే మరణదండన తప్పదు. అనవసరంగా ప్రాణాలమీదికి తెచ్చుకోకు. అన్నదమ్ముల్లో పెద్దవాడికే రాజయ్యే అర్హత వుంటుంది. అది సంప్రదాయం," అని నచ్చ చెప్ప చూసింది మహారాణి.

అయితే, విజయుడు మొండిగా, "అదేం కుదరదు! ఇప్పటికే సైన్యంలో చాలామంది నా పక్షంలో వున్నారు. సైన్యాధిపతి ఊగిసలాడుతున్నాడు. మంత్రులు కొందరు నన్నభిమానిస్తున్నారు. రాజద్రోహం చేస్తే నేను రాజును తప్పక అవుతాను. అన్నయ్య ఓడిపోయి అడవుల పాలవుతాడు," అన్నాడు.

మహారాణి కంగారుపడి భర్తకు కబురు చేసి, ఈ విషయం చెప్పింది. కన్న కొడుకే సింహాసనం కోసం కుట్ర చేస్తున్నాడని తెలిసి విక్రమసేనుడు కోపం పట్టలేక పోయాడు.ఆయన కొడుకులిద్దరినీరప్పించి, విజయుడిని కఠినంగా శిక్షిస్తానన్నాడు. అజేయుడు, తండ్రిని వారించాడు.

"నాన్నా! మీరు ఆందోళన పడకండి. విజయుడి చర్యలను నేను రహస్యంగా కనిపెడుతూనే వున్నాను. విజయుడు కలిసిన వారందరినీ, నేనూ కలుస్తూ వచ్చాను. వాళ్ళందరూ విజయుడి మాట కాదనలేక అంగీకరించినట్లు నటించినా, నేనే ప్రభువును కావాలని కోరుకుంటున్నారు. మీరు తమ్ముణ్ణి క్షమించండి!" అన్నాడు అజేయుడు తండ్రితో.

"కానీ, వీడిలో అంతాయింతా అనరాని రాజ్యకాంక్ష వుంది. శిక్షించ కుండా విడిచి

పెట్టడం వల్ల ఏదో ఒక రోజున ప్రమాదం కలగవచ్చు," అన్నాడు విక్రమసేనుడు.

దీనికి అజేయుడు, "నాకు నిజంగా రాజ్యకాంక్ష లేదు. మీరు విజయుడినే యువరాజును చేసి ఏడాది పాటు రాజ్యాన్నేలే అవకాశమివ్వండి. ప్రజలతడి పరిపాలనను ఆమోదిస్తే, అతడినే రాజును చేయవచ్చు. అప్పుడు నేను అరణ్యానికి వెళ్ళి హాయిగా తపస్సు చేసుకుంటాను," అన్నాడు.

అయిష్టంగానే రాజు విక్రమసేనుడు ఇందుకుఒప్పుకున్నాడు. విజయుడు ఏడాది పాటు రాజ్యాన్నెంతో చక్కగా పరిపాలించి, మంచిపేరు తెచ్చుకున్నాడు.



ఈ స్థితిలో అజేయుడు సభనొకటి ఏర్పాటుచేసి, "విజయుడెంత మంచి పాలకుడో ఋజువు చేశాను. ఇక ఈ రాజ్యాన్ని అతిడికే అప్పగించి, నేను అరణ్యాలకు పోదామనుకుంటున్నాను," అని తన అభీష్టం చెప్పాడు.

సభ అంతా ఏక కంఠంతో, అజేయుడే తమకు రాజుగా వుండాలని ప్రకటించింది. విజయుడిది విని తెల్లబోయి సభికులతో, "మీకు నా సమర్థతపై నమ్మకం లేదా?" అని అడిగాడు.

విజయుడి వెనక అజేయుడుంటేనే అతడి సమర్థత రాణిస్తుందనీ, అజేయుడిని మించిన సమర్థులెవ్వరూ రాజ్యంలో లేరనీ సభికులన్నారు.

అప్పుడు అజేయుడు వారితో, "ఈ దేశానికి నేనే రాజును. నా ప్రతినిధిగా మాత్రమే విజయుడు ఇక్కడ వుంటాడు. నేను అరణ్యానికి వెళ్ళి తపస్సుచేసిఅతీంద్రియశక్తులు సాధించి మనరాజ్యాన్ని కాపాడుతూంటాను. విజయుడి పాలనలో ఎవరికి కష్టం తోచినా, న్యాయం కోసం నావద్దకు రావచ్చును," అని తన తుదినిర్ణయం చెప్పాడు.

విజయుడు రాజయ్యాడు. కాని అతడికి తృప్తి లేదు. ప్రజలందరూ అతడిని అజేయుడి ప్రతినిధి గానే భావిస్తున్నారు. ఇప్పటికే అజేయుడు మహాశక్తిమంతుడు. దానికి తపోబలం కూడా తోడైతే తనకు ప్రమాదమని విజయుడు శంకించాడు.



ముందు విజయుడు కారాగారంలోవున్న కొందరు హంతకులకు విముక్తి కలిగించి, అరణ్యంలో వున్న అజేయుణ్ణి చంపడానికి పంపాడు. వాళ్ళు వెళ్ళి, అజేయుడి తపశ్శక్తికీ, ధర్మబోధలకూ తన్మయులై మానసిక పరివర్తన చెంది, అతడికి శిష్యులయ్యారు. తర్వాత విజయుడు, అన్నగారికి తపోభంగం చేయాలని అప్సరసలను తలదన్నే అపురూప సౌందర్యవతులయిన యువతులను పంపాడు. అజేయుడు వారిని తన శిష్యులకిచ్చి పెళ్ళిచేసి తనకింకా పెళ్ళికాని శిష్యులు చాలామంది ఉన్నారనీ, మరి కొందరు యువతులను పంపమనీ తమ్ముడికి కబురంపాడు.

అజేయుడిని తానేమీ చేయలేనని విజయుడికర్థమైంది. ప్రజలు అజేయుడి కంటే తను తక్కువ అనుకుంటున్నారని అతడు రాజ్యంలో ఒక చాటింపు వేయించాడు. ఆప్రకారం విజయుడు, అజేయుడి ప్రతినిధి కాదు, దేశానికి రాజు.

ఇందుకు కొందరు మంత్రులు, రాజప్రతినిధులు, రాజోద్యోగులు ఎదురు తిరిగారు. విజయుడు వాళ్ళకు రాజ్య బహిష్కార శిక్ష విధించాడు. వాళ్ళంతా అరణ్యంలో వున్న అజేయుడి వద్దకు వెళ్ళారు. అజేయుడు వాళ్ళతో, "నేను విజయుడి పాలన విషయంలో జోక్యం చేసుకోను. మీకతడి పాలన నచ్చకపోతే ఇక్కడే హాయిగా వుండిపోవచ్చు. ఇక్కడ మీకేలోటూ వుండదు," అన్నాడు.

క్రమంగా విజయుడి పాలన క్రూరంగా మారింది. అందువల్ల రాజ్యం వదిలి అరణ్యానికి వెళ్ళే వారి సంఖ్య పెరిగింది. అందరికీ అజేయుడు ఆశ్రయమిచ్చాడు. అంతమంది పోషణ సామాన్యమైన విషయం కాదు. అందువల్ల అజేయుడు కోరినదల్లా ఇచ్చే ఒక మహావటవృక్షాన్ని తన తపోబలంతో సృష్టించాడు.

ఒకనాడు విజయుడు కొంతమంది సైనికులను వెంటబెట్టుకుని అరణ్యానికి వెళ్ళి అన్నను కలుసుకుని, "ఇక్కడ నువ్వు నేరస్థులకు ఆశ్రయం ఇస్తున్నావు. నీ మీద రాజ

ద్రోహ నేరం మోపబడింది. దీనికి నీ సమాధానం ఏమిటి?" అని ప్రశ్నించాడు.

తమ్ముడిలా ప్రశ్నించగానే అజేయుడు ఎక్కడలేని కోపంతో, "నేనీ దేశానికి రాజును! నేను నీ ఆరోపణలకు సమాధానం ఇవ్వ నవసరం లేదు. తక్షణం రాజ్యం విడిచిపో!" అన్నాడు.

విజయుడు తన వెంటవున్న సైనికులతో అజేయుణ్ణీ, అతడాశ్రయం ఇచ్చినవాళ్ళనూ బంధించ బోయాడు. అయితే, అజేయుడు వటవృక్షంకేసి చూసి చిటిక వేయగానే, దాని కొమ్మల నుంచీ, ఊడల నుంచీ వందల మంది సైనికులు కిందికి ఉరికి, క్షణాల మీద విజయుడితో పాటు, అతడి సైనికులను కూడా బంధించారు.

అప్పుడు అజేయుడు తృప్తిగా తలాడించి, తన సైనికులకు, "ఈ విజయుడు దేశద్రోహి! వీణ్ణి దేశం సరిహద్దులు దాటించి వదిలిరండి!" అని ఆజ్ఞాపించాడు.

ఆ తర్వాత అతడు అరణ్యం వదిలి నగరం చేరి, పట్టాభిషేకం చేసుకుని, అరుణగిరికి రాజయ్యాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వేదాంతీ, నిగ్రహశక్తీ, శాంతగుణం కల వాడైన అజేయుడి ప్రవర్తనలో అంత పెద్ద మార్పు రావడానికి, రాజుకావాలన్న అతడి ప్రలోభమే కదా కారణం? అతడెన్నో సార్లు విజయుడి దుష్ప్రవర్తన క్షమించాడు. తనకు హాని తలపెట్టి అరణ్యానికి వచ్చిన వాణ్ణి, అతి సునాయాసంగా బంధించాడు.



ఇంత చేసిన తర్వాత అజేయుడు, తమ్ముడికి రాజ్యబహిష్కార శిక్ష విధించి, తనే రాజుగా ప్రకటించు కోవడం ప్రలోభం, అక్రమ ప్రవర్తనా అనిపించుకోదా? ఈ స్వార్థ పూరితమైన చర్యతో అతడిలో వున్న శాంత గుణం, నిగ్రహశక్తీ మొదలైన సద్గుణాలన్నీ మంట గలిసినట్టే గదా? ఇది అజేయుడి ఓటమి గాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సామాన్య వ్యక్తులనూ; కోపతాపాలూ, స్వార్థ ప్రలోభాలూ వంటి వాటికి అతీతులైన జ్ఞానులనూ, ఒకే దృష్టితో ఖడించడం గాని లేక మెచ్చుకోవడం గాని లోకజ్ఞత అనిపించు కోదు. ఒక్కొక్కసారి వివేకీ, జ్ఞానీ అయినవాడు తన మేలు కోసం కాక, ప్రజల మేలు కోసం అత్యంత కఠినంగా ప్రవర్తించ వలసి వస్తుంది. అవసరాన్ని బట్టి అలా ప్రవర్తించక ఉపేక్షించే వాడు, వివేకీ, జ్ఞానీ అనిపించుకోవడానికి అర్హుడు కాదు. ఆదిలో విజయుడి రాజ్యకాంక్ష కేవలం వ్యక్తి పరమైనది. కానీ, అతడు రాజయ్యాక, అన్న అజేయుడు తనకు ప్రతిబంధకం అన్న భ్రమలో ప్రజాహింసకుడుగా తయారయ్యాడు. అజేయుడు కొంతకాలం చూసి, తమ్ముడిలో మంచి మార్పు రాదని గ్రహించాకే, అతడికి దేశబహిష్కారం విధించాడు. రాజద్రోహం అనేది రాజకుటుంబానికీ, రాజబంధువులకూ, ఆశ్రితుల వరకే పరిమితమైనది. కానీ విజయుడు ప్రజాకంటకుడుగా తయారై, దేశద్రోహానికే ఒడిగట్టాడు! ప్రజాక్షేమం కోరేవారు అది ఏమాత్రం సహించరానిది. రాజు కన్న, రాజ్యం అతి ఉన్నత మైనది, పవిత్రమైనది. ఈ కారణం వల్లనే అజేయుడు, తమ్ముణ్ణి రాజద్రోహి అని గాక దేశద్రోహి అని ప్రకటించి, తను రాజయ్యాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : శ్రీరామకమల్ రచన]



# చందమామ అనుబంధం - 57

మనదేశపు పక్షులు - జంతువులు:

## డేగలు

అంతర్జాతీయ క్రీడోత్సవాలు, పోటీలు ప్రారంభించడానికి ముందు విశ్వశాంతికి చిహ్నంగా పావురాలను ఎగరవేయడం సంప్రదాయంగా ఉంటున్నది. పూర్వ కాలంలో సుదూర ప్రాంతాలకు పావురాల ద్వారా లేఖలను పంపేవారు. చిలుకలకు మాటలు నేర్పే అలవాటు కూడా ఉన్నది. అదేవిధంగా మిగతా పక్షులను వేటాడ డానికి డేగలకు శిక్షణ ఇస్తారు. ఆకాశంలో చాలా ఎత్తులో గంభీరంగా ఎగిరే డేగలు ఆహారం కంటబడగానే ఒక్క ఊపులో వెళ్ళి పట్టేస్తాయి. దృఢమైన శరీరమూ, మొన దేలిన రెక్కలూ గల డేగలు గంటకు 280 కి.మీ. వేగంతో ఎగరగలవని చెబుతారు!




ఉత్తర భారతదేశంలో 'షహీన్' అని పిలిచే ఈ డేగలను ఉపయోగించి కొన్ని రాజకుటుంబాలలోపక్షులనువేటాడేపోటీలు జరిపేవారు. ఇది ఎగిరే పక్షులను పట్టు కుని చెట్టు కొమ్మ మీద వాలి, ఈకలు లాగేసి మరీ తింటాయి.

ప్రపంచవ్యాప్తంగా డేగలలో దాదాపు 60 జాతులు ఉన్నాయని చెబుతారు. వీటి ముక్కు పైభాగం దవడ దృఢంగానూ, పదునుగానూ ఉంటుంది. 'షహీన్' జాతి డేగలకు రెండువైపులా చారలు గల నల్లటి తలా, వెడల్పాటి రెక్కలూ ఉంటాయి. అడుగు భాగం లేతగులాబీ లేదా ఎరుపు రంగుతో ఉంటుంది. కొన్ని డేగలకు పొట్ట కింద నల్లటి చార ఉంటుంది.

జన సంచారం లేని కొండ శిఖరాల మీద డేగలు గూళ్ళు కడతాయి. యేటా ఒకే చోట గూళ్ళు కట్టి గుడ్లు పెడతాయి. మగడేగ కన్నా పెద్దదిగా ఉండే ఆడడేగ మూడు, నాలుగు లేత ఎరుపు రంగు గుడ్లు పెడుతుంది.



# మన సమకాలీన సాహిత్యం

భారత్ - పాకిస్తాన్ విభజనకు పూర్వం రోజులవి. పంజాబు ప్రాంతంలో నివసిస్తున్న అందమైన పల్లెటూరి యువతి పురో. పక్క గ్రామంలోని రామ్‌చంద్ అనే యువకుడితో పురో పెళ్ళి నిశ్చయమయింది. ఆమె పెళ్ళి సంబరం గురించిన తియ్యటి ఊహలలో ఉండగా, రషీద్ అనే ఒక ముస్లిం యువకుడు ఆమెను హఠాత్తుగా అపహరించుకుని వెళ్ళాడు.

వడ్డీ వ్యాపారులయిన పురో తాతలు, రషీద్ తాతల కుటుంబాన్ని నానా బాధలు పెట్టి నాశనం చేశారు. ఆ పగ తీర్చుకోవడానికి ఇప్పుడు రషీద్ పురోను అపహరించాడు.

రషీద్ ఇంట్లో కొన్నాళ్ళు బందీగా కాలం వెళ్ళబుచ్చిన పురో, ఒకనాటి రాత్రి అక్కడి నుంచి

## అమృతా ప్రీతమ్ 'పింజారీ'



రహస్యంగా తప్పించుకుని పారిపోయి ఇల్లు చేరింది.

అయితే, ఆమెకు పుట్టిన ఇంట ఘోరమైన నిరాదరణ ఎదురయింది. ఎందుకంటే పురో హైందవ యువతి. ఆమెను ముస్లిం యువకుడైన రషీద్ అపహరించాడు. ఇప్పుడామెను మళ్ళీ ఇంట్లో చేర్చుకున్నట్టయితే ఆమె కుటుంబం సమాజం నిరాదరణకు గురవుతుంది. కాబట్టి పురోను కుటుంబంలో చేర్చుకోవడానికి పెద్దలు సిద్ధంగా లేరు!

మరో మార్గం లేక పురో ఇల్లు వదిలి పెట్టింది. రషీద్ ఆమెను చేరదీసి ఆశ్రయం ఇచ్చాడు. ఇరువురూ పెళ్ళి చేసుకుని వేరొక గ్రామానికి వెళ్ళిపోయారు.

పురో చెల్లెలు రామ్‌చంద్‌ను పెళ్ళాడింది. రామ్‌చంద్ చెల్లెలు లాజో పురో తమ్ముణ్ణి పెళ్ళి చేసుకున్నది.

అయినా, పురోకూ ఆమె పుట్టింటికీ సంబంధ బాంధవ్యాలు తెగిపోయాయి. పురో పేరు హమీదాగా మారింది. భర్త రషీద్ ఆమెను ఎంతో ప్రేమగా చూసుకోసాగాడు. వాళ్ళ కొక కొడుకు పుట్టాడు. సంవత్సరాలు గడిచిపోయాయి.

భారత్ - పాకిస్తాన్ విభజన జరిగింది. దేశంలో కలహాలు చెలరేగాయి. ఉప ఖండంలో వివిధప్రాంతాలలో హిందువులు — ముస్లింలు . ఒకరినొకరు హతమార్చుకోసాగారు. పురో ఉంటున్న ప్రాంతం పాకిస్తాన్‌లో కలిసింది. అక్కడున్న హిందువులను హడలగొట్టి తరమసాగారు. వాళ్ళలో కొందరు

హడలి పోయి ఒక పెద్ద ఇంట్లో దాక్కున్నారు. దుండగులు ఆ ఇంటికి నిప్పంటించారు. సమయానికి పోలీసులు వచ్చి వాళ్ళను కాపాడారు గాని, వాళ్ళు వచ్చేలోగానే ముగ్గురు మంటలపాలయ్యారు. బ్రతికిఉన్నవారిని ఇండియాకు తరలించారు. చనిపోయినవాళ్ళ అస్థిపంజరాలు మూడూ అక్కడే ఉండిపోయాయి.

ఊరు వదలిపెడుతున్న హిందువులు కొందరు పోలీసు రక్షణలో, పురో ఉన్న గ్రామంలోనే ఒకరాత్రి గడిపారు. తాను మొదట పెళ్ళాడడానికి ఏర్పాటయిన రామ్‌చంద్‌ను పురో ఆరోజు చూసింది. అతని ద్వారా తన తమ్ముడి భార్య లాజో ఆచూకీ తెలియలేదని ఆమెకు తెలిసింది.

తెల్లవారగానే హిందువులు ఇండియాకు బయలుదేరి వెళ్ళారు. పురో మాత్రం లాజో కోసం వెతకసాగింది. లాజో, వితంతువయిన ఓ వృద్ధురాలి ఇంట కనబడింది. అందమైన ఆ అమ్మాయిని వృద్ధురాలి కొడుకు పెళ్ళాడాలని పథకం వేశాడు.



అయితే, పురో తన భర్త రషీద్ సహాయంతో అర్ధరాత్రి సమయంలో ఆ అమ్మాయిని రహస్యంగా తీసుకుపోయి, ఆమె భర్త అయిన తన తమ్ముడి దగ్గరికి చేర్చింది!

భారతదేశానికి తప్పించుకుని వెళ్ళడానికి అది సరైన తరుణం. వెళదామని అమె సోదరుడు సలహా ఇచ్చాడు కూడా. అయినా, పురో భర్తను వదలి వెళ్ళడానికి ఇష్టపడలేదు. మొదట అతడు ఆమెను పగతీర్చుకోవడానికి బలవంతంగా అపహరించిన మాట నిజమే అయినప్పటికీ, ఆ తరవాత భర్తగా ఆమె పట్ల ఎంతో ప్రేమాదరాలు చూపుతున్నాడు.

దోపిడీకి, దుర్మార్గానికీ లోనై కేవలం అస్థిపంజరాలుగా మారే స్త్రీల విషాద స్థితిగతులకు అద్దంపట్టే 'పింజారీ' (అస్థిపంజరం) నవల ఇతివృత్తం ఇది. ప్రముఖ పంజాబీ రచయిత్రి అమృతా ప్రీతమ్ దీనిని రచించారు. సమాజాన్ని యథాతథంగా చూపడంవల్ల రచయిత్రి ఈ నవలకు భావగర్భితంగా 'అస్థిపంజరం' అని పేరు పెట్టారు. అమృతాప్రీతమ్ సాహిత్య అకాడెమీ అవార్డునూ, జ్ఞానపీఠ పురస్కారాన్నీ అందుకున్నారు.

# మీకు తెలుసా?

1. క్రైస్తవులు విషాద సూచకంగా నల్లటి బట్టలు ధరిస్తారు. చీనా దేశస్థులు ఏ రంగు బట్టలు ధరిస్తారు?
2. బొంబాయిలోని 'గేట్ వే ఆఫ్ ఇండియా' ఏ రాజు గౌరవార్థం నిర్మించబడింది?
3. విక్టోరియా రాణి ఇంగ్లాండును ఎక్కువ కాలం పరిపాలించారు. ఎన్ని సంవత్సరాలో తెలుసా?
4. 'కబూకీ' అనే నృత్యనాటక ప్రక్రియ ఏ దేశానికి చెందినది?
5. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఒక రాష్ట్రం మొట్టమొదట స్వతంత్రం ప్రకటించుకున్నది. కాని అది అమెరికా రాజ్యాంగాన్ని చివరగా ఆమోదించింది. ఆ రాష్ట్రం ఏది?
6. ఆంగ్లేయులు 1788వ సం॥లో 'ఖైదీలకాలనీ'గా ప్రకటించిన ఆస్ట్రేలియాలోని నగరం ఏది?
7. దాదాపు 2,000 సం॥లుగా స్వతంత్రంగా ఉన్న ఆఫ్రికా దేశం ఏది?
8. 2,400 సం॥లకు పూర్వం మరణశిక్ష అనుభవించిన గ్రీకు తత్వవేత్త ఎవరు?
9. మన దేశంలో వెలువడిన మొట్టమొదటి వార్తాపత్రిక 'బెంగాల్ గజెట్' ప్రచురణకర్త ఎవరు?
10. చైనాను పరిపాలించిన మొట్టమొదటి చక్రవర్తి ఎవరు?
11. భూమిమీద అతిశీతల ప్రదేశం ఏది?
12. సర్ ఐజాక్ పిట్‌మన్ ఎందుకు ప్రసిద్ధి గాంచాడు?
13. 'తాజ్‌మహల్' రూపకల్పన చేసిన పర్షియా వాస్తుశిల్పి ఎవరు?
14. మొట్టమొదట స్త్రీలకు ఓటుహక్కు ఇచ్చిన దేశం ఏది?
15. అత్యంత ఎత్తయిన ప్రదేశంలో ఉన్న రాజధానీ నగరం ఏది?
16. అంతరిక్షంలోకి ప్రయాణం చేసిన మొట్టమొదటి వనిత ఎవరు?
17. 'మీటర్ గేజ్' 'బ్రాడ్ గేజ్' మధ్య ఉన్న తేడా ఎంత?
18. మన దేశంలో ప్రసిద్ధిగాంచిన సూర్యదేవాలయం ఏది?
19. కర్ణాటక సంగీతంలో 'త్రిమూర్తులు'గా ఎవరిని చెబుతారు?
20. బ్రహ్మపుత్రానది ఎక్కడ ఏ సముద్రంలో కలుస్తున్నది?

# సమాధానాలు

1. తెలుపు.
2. ఇంగ్లాండు రాజు ఐదవ జార్జ్.
3. 63 సం॥.
4. జపాన్.
5. రోడ్ ఐలండ్.
6. సిడ్నీ.
7. ఇథియోపియా.
8. సోక్రటీస్.
9. జేమ్స్ అగస్టస్ హికీ.
10. ఛెంఘిజ్‌ఖాన్ మనమడు కుబ్లాఖాన్.
11. అంటార్కిటికాలోని వోస్టాక్ స్టేషన్ (– 87° సెల్సియస్).
12. షార్ట్‌హాండ్ లిపి రూపొందించాడు.
13. ఉస్తాద్ ఈసా.
14. న్యూజిలాండ్, 1893వ సం॥లో.
15. బొలీవియా రాజధాని - లాపాజ్.
16. వాలెంటీనా తెరిష్కోవా.
17. మీటర్ గేజ్1 మీటరు; బ్రాడ్ గేజ్ 1.675 మీటర్లు.
18. ఒరిస్సాలోని కోణార్క.
19. త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు.
20. నోవఖాళీ వద్ద. బంగాళాఖాతంలో.



# ఘనవైద్యుడు

విక్రమసేనుడనే రాజు అడవికి వేటకు వెళ్ళి దారి తప్పాడు. దారి వెతకడంలో ముళ్ళ పొదలు గీరుకుని ఆయన బాగా గాయ పడ్డాడు. ఏమరుపాటున వుండగా, ఆయన నొక పాము కాటు వేసింది. అంతే! విక్రమ సేనుడికి స్పృహ తప్పింది.

ఆయనకు తిరిగి స్పృహ వచ్చేసరికి, ఒక ఆశ్రమంలో పూల పాన్పుపై పడుకుని వున్నాడు. పక్కనే వున్న ముని, రాజు కళ్ళు తెరవగానే, "సమయానికి నాశిష్యులు నిన్ను చూసి ఇక్కడకు తీసుకు వచ్చారు. నాకు తెలిసిన వైద్యం చేశాను. ఇప్పుడు నీకెలా వుంది, నాయనా?" అని అడిగాడు ఎంతో ఆప్యాయంగా.

విక్రమసేనుడు పరీక్షగా శరీరాన్ని చూసు కున్నాడు. గాయాలెక్కడా కనిపించలేదు. శరీరంలో కూడా పాముకాటు ప్రభావం వున్నట్టు ఆయనకు తోచలేదు.

ఆయన మునికి నమస్కరించి, "తమరు సామాన్యులు కారు. మీ వంటి వారిక్కడ అడవుల్లో వుండడం న్యాయం కాదు. నా రాజధానికి వచ్చి, నగరవాసులను వ్యాధుల నుంచి రక్షిస్తూ వుండాలని నా కోరిక," అన్నాడు.

ముని నవ్వి, "రాజా! ఐహిక సుఖాల మీద కోరిక లేని మునిని నేను. నాకు తెలిసిన వైద్యం చాలా తక్కువ. సంసారిగా వున్నప్పుడు ప్రచండుడనే ఘనవైద్యుడికి శుశ్రూష చేసి కొంత వైద్యం నేర్చుకున్నాను. ప్రచండుడికి తెలిసిన దాంట్లో నాకు తెలిసింది లక్షోవంతు కూడా వుండదు. నీ రాజ్యంలో ప్రచండుడంతటి వాడుండగా, నా అవసరం ఏముంటుంది!" అన్నాడు.

"నా రాజ్యంలో ప్రచండుడనే ఘనవైద్యు డున్నట్లు నాకు తెలియదే?" అని ఆశ్చర్య పోయాడు విక్రమసేనుడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి



"వైద్యుల గురించి నాకేం తెలుస్తుంది, ప్రభూ!రాజవైద్యుడు ప్రదీపుడి నడుగుదాం," అని మంత్రి, ప్రదీపుడి కోసం నౌకరును పంపాడు.

ప్రదీపుడు వచ్చి రాజు సందేహం విని, "ప్రభూ! రాజవైద్యుడి నైన నన్ను మించిన వైద్యుడీ రాజ్యంలో లేడు. నాకు ఘనంగా రాజసన్మానం చేయించమని నోరు విప్పి అడగడానికి నాకు సిగ్గూ, మొహమాటం ఎక్కువగా అడ్డువస్తున్నాయి," అన్నాడు.

"అయితే, సౌభాగ్యనగరంలోని ప్రచండుడనే వైద్యుడి సంగతి నీకు తెలియనే తెలియదా?" అని అడిగాడు విక్రమసేనుడు.

ప్రచండుడి పేరు వింటూనే ప్రదీపుడి ముఖం అదోలా అయిపోయింది. అతడు అయిష్టంగా ముఖంపెట్టి,"ప్రచండుడి పేరు విన్నాను, ప్రభూ! ఆయనచేత వైద్యం చేయించుకోవడానికి భాగ్యవంతులు బిచ్చగాళ్ళు కావాలిట!" అన్నాడు.

ఇది విని విక్రమసేనుడాశ్చర్యపడి,"ఈ విషయం మీకెవరు చెప్పారు?" అని ప్రశ్నించాడు.

"ఆమధ్య సౌభాగ్యనగరంలోని కుమారగుప్తుడనే భాగ్యవంతు డిక్కడకు వచ్చాడు. ఆయన నాకు స్నేహితుడు. ఆయన ద్వారా నాకీ విషయం తెలిసింది. వైద్యుడికి ఆశ వుండడంలో అంతగా తప్పు లేదు; అత్యాశ

ఇందుకు ముని, "ప్రచండుడంతటి ఘనవైద్యుడు నీ రాజ్యంలో వుంటే గుర్తించని నువ్వేం రాజువు? ఆయనకు రాజసన్మానం చేసేవరకూ నువ్వు సక్రమంగా పరిపాలన చేసినట్టు కాదు. ఆయన నీ రాజ్యంలోని సౌభాగ్యనగరంలో వుంటున్నాడు. వెళ్ళి, నీ రాజధర్మం నిర్వహించు," అన్నాడు మందలింపుగా.

ముని సహాయంతో సక్రమ మార్గం తెలుసుకుని, విక్రమసేనుడు రాజధానికి చేరుకున్న వెంటనే, మంత్రిని పిలిచి,"మన రాజ్యంలో రాజసన్మానం పొంద దగ్గ ఘన వైద్యుడున్నాడేమో మీకు తెలుసా?" అని అడిగాడు.

వుంటే మాత్రం అది తప్పకుండా అమానుష మనిపించుకుంటుంది!" అన్నాడు ప్రదీపుడు.

ప్రదీపుణ్ణి పంపించేశాక విక్రమసేనుడు, మంత్రితో అసంతృప్తిగా, "నేను ప్రచండుణ్ణి గురించి చాలా గొప్పగా విన్నాను. చెప్పిన వాడు కూడా సామాన్యుడు కాదు, మహాముని! అయితే, ప్రదీపుడు సాటి వైద్యుడి పట్ల అసూయ వున్నప్పటికీ కూడా, మహారాజునైన నాతో కల్పించి అబద్ధం చెప్పేటంత సాహసం చేస్తాడనుకోను," అన్నాడు.

దానికి మంత్రి, "మీ సందేహం తీరాలంటే కుమారగుప్తుడినే కలుసుకోవాలి. అయితే, తమరు మహారాజులా వెళితే అతడు నిర్భయంగా నిజం చెప్పలేడు. మనం మారువేషాల్లో ఆ నగరానికి వెళ్ళి నిజం తెలుసుకుందాం. మహాముని అబద్ధమాడడు. మన రాజవైద్యుడు ప్రదీపుడే తెలివిగా అబద్ధం చెప్పాడని నాకు తోస్తున్నది," అన్నాడు.

రాజు, మంత్రి మారువేషాలలో సౌభాగ్య నగరం వెళ్ళారు. అక్కడ ప్రచండుడికి పెద్ద పేరున్నట్టు వారికి తోచలేదు. కుమార గుప్తుడిని కలుసుకుంటే, ఆయన ప్రదీపుడికి చెప్పినదే చెప్పాడు.

అప్పుడు మంత్రి, "అయ్యా! ప్రచండుడు ఘనవైద్యుడని అడవుల్లోని మునులు కూడా చెబుతున్నారట. క్షమించండి! తమరాయనను గురించి ఇలా దుష్ప్రచారం చేయడానికి, ఆయనపట్ల తమకున్న వ్యక్తి



గతమైన శత్రుత్వమేమైనా కారణమా?" అని అడిగాడు.

దానికి కుమారగుప్తుడు నవ్వి, "నాకు ప్రచండుడంటే కిట్టనిమాట నిజమే! కానీ ఆయనను గురించి నేనన్నది, నా అభిప్రాయంకాదు. ప్రచండుడి ప్రాణమిత్రుడైన పరాంకుశుడనే కవిది. కావాలంటే మీరు వెళ్ళి ఆయన నడగండి," అన్నాడు.

రాజూ, మంత్రీ పరాంకుశుణ్ణి కలుసుకుని, కుమారగుప్తుడి మాటలు నిజమేనని గ్రహించాక, రాజు, "ప్రచండుడు ఘన వైద్యుడే కావచ్చు. కానీ రాజసన్మానికి అర్హమైన మంచితనం ఆయనలో లోపించడం దురదృష్టం!" అంటూ బాధపడ్డాడు.

పరాంకుశుడీ మాటలకు ఆశ్చర్యపడి, "నేనాయన వైద్యం గొప్పతనంగురించే కాక, మంచితనంగురించి కూడా అందరికీ అర్థం కావాలని చమత్కారంగా చెప్పిన మాట, మీకిలా అర్థమయింది! ప్రచండుడికి ఆశ అన్నదే లేదు. మానవ సేవయేమాధవసేవ అని నమ్మి పేదవాళ్ళకూ, బిచ్చగాళ్ళకూ మాత్రమే వైద్యం చేస్తుంటాడు. అందువల్లనే ఆయనకు రావలసినంత ప్రసిద్ధిరాలేదు. ఏ భాగ్యవంతుడైనా ఆయనచేత వైద్యం చేయించుకోవాలంటే, బిచ్చగాడివేషం వేయక తప్పదని, నా అభిప్రాయం," అన్నాడు.

రాజు విక్రమసేనుడి సందేహం తీరిపోయింది. ఏమాటనైనా వెంటనే నమ్మకూడదనీ, ముఖ్యంగా కవులు చమత్కార ప్రియులు గనక, వాళ్ళనే మాటల్లో మరొక అర్థం కూడా వున్నదేమో అని తెలుసుకునేందుకు ప్రయత్నించాలనీ, ఆయన గ్రహించాడు.

ఆ తర్వాత విక్రమసేనుడు, ప్రచండుడికి ఘనసన్మానం జరిపించడమే కాక, రాజ్యంలో వివిధ రంగాల్లో గొప్పవారైన వారిని గురించి చారుల ద్వారా సమాచారం సేకరించసాగాడు. గొప్పవారిని గురించిన ప్రచారం సామాన్యులలో మార్పు తీసుకువస్తుందనడానికి సూచనగా, ముందు రాజవైద్యుడైన ప్రదీపుడే తీరిక సమయాల్లో పేదలకు వైద్యం చేయసాగాడు.





# సోమరియుద్ధం

కోసలరాజ్యంలో వీరదాసు అనే యువకుడుండే వాడు. వాడు వట్టి సోమరిపోతు. వాడికి నిద్ర, తిండి తప్ప మరేమీ పట్టేవి గావు. తల్లి దండ్రులు వాడి బాల్యంలోనే చనిపోవడంతో, అవ్వ వాణ్ణి ఎంతో గారాబంగా పెంచింది. దానితో వాడు మరీ సోమరిపోతుగా తయారయ్యాడు.

వీరదాసు పుట్టి పెరిగిన కోసలరాజ్యానికీ, పక్కనే వున్న వైదేహిరాజ్యానికీ శత్రుత్వమున్నది. కోసలను జయించాలన్న తలంపుతో వున్న వైదేహిరాజు సింహకేతుడు రహస్యంగా పెద్ద సైన్యాన్ని సమకూర్చుకుని, కోసలపై యుద్ధం ప్రకటించాడు.

వేగుల ద్వారా శత్రుసైన్యం, తనసైన్యం కన్న రెండు మూడింతలున్నదని తెలుసుకున్న కోసలరాజు చంద్రకాంతుడు, రాజ్యంలో వున్న యువకులందర్నీ సైన్యంలో చేరవలసిందిగా చాటింపు వేయించాడు.

ఆ చాటింపు విని ఎందరో యువకులు దేశ రక్షణ కోసం సైన్యంలో చేరారు. వారికి యుద్ధశిక్షణ ఇవ్వడం ప్రారంభమైంది. ఇంకా సైన్యంలో చేరని యువకులెవరైనా ఉన్నారేమో తెలుసుకుని, వాళ్ళను బలవంతంగానైనా సైన్యంలో చేర్చవలసిందిగా రాజు గూఢచారులకు ఆజ్ఞలు జారీచేశాడు.

ఈ విధంగా, సైన్యంలో చేరకుండా తప్పించుకు తిరుగుతున్న వీరదాసు, గూఢచారుల కంటబడ్డాడు. వాళ్ళు, వాడితో, "ఇంకా నువ్వు సైన్యంలో ఎందుకు చేరలేదు? సైన్యంలో చేరి నీ దేశభక్తిని నిరూపించుకో," అన్నారు.

అందుకు వీరదాసు ఆశ్చర్యంగా, "దేశభక్తీ, యుద్ధం అన్న మాటలు వినడం ఇదేమొదటిసారి. అవ్వపెట్టిన తిండి తినడం, హాయిగా నిద్ర పోవడం తప్ప నాకు మరేం తెలియదు," అన్నాడు.

ఎన్. శివనాగేశ్వరరావు



ఈ జవాబుతో గూఢచారులు వాడు సోమరిపోతని గ్రహించి, పెడరెక్కలు విరిచి కట్టి తీసుకుపోయి సైనికశిక్షణ పొందుతున్న యువకుల మధ్య పడవేశారు.

ఇంతలో సింహకేతుడు సైన్యంతో కోసల రాజ్య సరిహద్దులను సమీపించాడు. రాజు చంద్రకాంతుడు శత్రురాజును ఎదిరించేందుకు సైన్యంతో బయలు దేరాడు. సైనికులందరూ కవచాలు, శిరస్త్రాణాలూ ధరించి, చేత కత్తులు పట్టుకుని నడవసాగారు. వీరదాసు మాత్రం వాటిని ధరించే ఓపిక లేక కత్తి మాత్రం తీసుకున్నాడు. యుద్ధభూమిలో ఆకలి వేస్తే తినడానికి కంచు గిన్నెలో నాలుగు రొట్టెలు పెట్టుకుని, దాన్ని పొట్ట దగ్గిర దుస్తుల వెనక దాచాడు. ఒక తాబేటికాయను నీటితో నింపి భుజానికి తగిలించుకున్నాడు.

సైన్యం యుద్ధభూమి చేరింది. ఇరుపక్షాల మధ్య ఘోరయుద్ధం మొదలైంది. ఇదిచూసి వీరదాసు భయంతో కంపించిపోయాడు.

ఈ స్థితిలో వీరదాసుకు గాయపడి మూలుగుతూ వున్న ఒక ముసలిసైనికుడు కనిపించాడు. ఆసైనికుడు వీరదాసును చూసి దాహమన్నట్లుగా సైగచేశాడు. వీరదాసు తన దగ్గిరున్న తాబేటికాయలోని నీరును అతడి చేత తాగించాడు.

నీరు తాగిన ముసలిసైనికుడు కొంత సేదదేరి, తళతళమెరుస్తున్న తన దుప్పటిలోని కత్తిని వీరదాసుకు చూపించి, "ఈ కత్తితో శత్రురాజు గుండెల్లో పొడవాలనుకున్నాను. కానీ నాకా అదృష్టం లేదు. ఈ మరణ సమయంలో నిన్ను చూస్తుంటే, నాకేదో ఆపుణ్ణి చూసినట్టుగా వుంది. నా మనమరాలు చాలా అందగత్తె; మహాతెలివైనది. అది నేను చెప్పిన వాణ్ణే పెళ్ళాడతానని పంతంపట్టి కూర్చున్నది. ఇదిగో, ఈ ఉంగరం దానికిచ్చి, నేను పంపా నని చెప్పు. నువ్వు బతికి బయటపడితే తప్పక దానికి భర్తవవుతావు," అంటూ ఉంగరం వీరదాసుకిచ్చి, కత్తిపిడిని మరింత గట్టిగా బిగించి పట్టుకుని ప్రాణాలు విడిచాడు. ముసలిసైనికుడి మరణం చూడగానే,

వీరదాసుకు తనకు చావు తప్పదనిపించింది. అంతలో వాడికి చావు నుంచి తప్పించుకోవడానికి ఒక ఉపాయం తోచింది. వాడు చచ్చి పోయిన ముసలిసైనికుడి పక్కన పడుకుని, అతడి దుస్తుల కంటివున్న రక్తం కొంత తన దుస్తులకు పూసుకుని, చచ్చిపోయిన వాడిలా కళ్ళు మూసుకున్నాడు. ఆ మరుక్షణం వాడికి నిద్రపట్టేసింది.



అయితే, హఠాత్తుగా వాడూహించని ప్రమాదం వచ్చి పడింది. యుద్ధభూమిలో కొన్ని గుర్రాలు గాయపడి చెల్లా చెదురుగా పరిగెత్త సాగినై. వాటిల్లో ఒకదాని కాలు గట్టిగా భుజానికి తగలడంతో వీరదాసు బెంబేలు పడిపోతూ ఎగిరిలేచి నిలబడ్డాడు.

ఆ సమయంలో గుర్రాన్ని దూకిస్తూ అటుగా వచ్చిన శత్రురాజు సింహకేతుడు, వీరదాసును చూసి, కవచం, శిరస్త్రాణంలేకుండా యుద్ధరంగానికి వచ్చిన వీడెవడో మహావీరుడై వుంటాడనుకుని, "ఆహాఁ, ఇంత వీరుడివైన నీ చావు, నా చేతిలో రాసి పెట్టి వున్నదన్న మాట!" అంటూ కత్తితో వాడి పొట్టలో గట్టిగా పొడిచాడు.

ఆ కత్తిపోటు గురిగా, వీరదాసు రొట్టెలు దాచుకున్న కంచుగిన్నె మీదపడి, ఖణేల్‌మంటూ పెద్ద శబ్దమైంది. దానితో రాజు ఎక్కిన గుర్రం బెదిరి వెనక కాళ్ళ మీద లేచింది. రాజు పట్టుతప్పి కింద పడిపోయాడు.

ఆయన మరుక్షణం జరిగిందానికి ఆశ్చర్య పడుతూ, దూరంగా పడివున్న కత్తిని చేతిలోకి తీసుకోబోతున్నంతలో, వీరదాసు ప్రాణభయం కొద్దీ తెగువ తెచ్చుకుని, "అయ్యో, నేను సోమరిని కాకుండా కత్తి యుద్ధం నేర్చుకుని వుంటే ఎంతబావుండేది? ఇప్పుడు, ఈ సైనికుడే నా ప్రాణం కాపాడాలి!" అంటూ ముసలి సైనికుడి శవాన్ని ఎత్తి రాజుపైకి విసిరాడు.

సైనికుడి శవం రాజు సింహకేతుడి మీద పడేసమయంలో, వాడి గుప్పిట బిగించి వున్న కత్తి, రాజు గుండెల్లో దిగింది. రాజు ఒక చావు కేకతో బాటు, "వైదేహీ రాజ్యానికీ, జై!" అంటూ నేలమీద కుప్పకూలి

పోయాడు. తమ రాజు మరణం చూసిన శత్రుసైనికులు భీతిల్లి పారిపోయారు. వీరదాసు చేతిలో, సింహకేతుడు చావ దంగురించివిన్న రాజుచంద్రకాంతుడు, వాణ్ణి చూడవచ్చి, "ఓహో, నువ్వు జగదేకవీరుడివి! అసహాయ శూరుడివి!" అంటూ గొప్పగా మెచ్చుకుని, వాణ్ణి రాజలాంఛనాలతో కోటకు తీసుకుపోయి, "ఏం కావాలో కోరుకో!" అన్నాడు.

అందుకు వీరదాసు, "మహారాజా! ఎంతటి అసహాయ శూరుడైనా యుద్ధ భూమిలో శత్రువులను పదులా, వందల సంఖ్యలో తెగటార్చినప్పుడు అలసిపోక తప్పదు గదా! నాకు కడుపు నిండా తిండితో పాటు కొంతసేపు నిద్రపోవడానికి మంచిచోటు చూపించండి, చాలు," అన్నాడు.

రాజు చంద్రకాంతుడు, వీరదాసుకు అన్ని వసతులున్న మంచి భవంతిని, సేవకులతోసహా ఏర్పాటు చేసి, దాన్ని వాడికి కానుకగా ఇచ్చాడు.

వీరదాసు వారం రోజుల పాటు, ఆ భవంతిలో సుఖంగా గడిపి, తర్వాత తన గ్రామం వెళ్ళి, అవ్వను మేనాలో తన భవంతికి తీసుకువచ్చాడు. అవ్వ పుట్టుసోమరి అయిన తన మనవడికి పట్టిన ఐశ్వర్యం చూసి చాలా సంతోషించింది.

కొద్ది రోజులు గడవనిచ్చి వీరదాసు, అవ్వకు ముసలిసైనికుడి మనమరాలి సంగతి చెప్పాడు. అవ్వ, ఆమె వున్న గ్రామానికి వెళ్ళి, ఉంగరం చూపి ముసలి సైనికుడి మనమరాలిని తీసుకు వచ్చింది. రాజుగారి సమక్షంలో వీరదాసుకూ, సైనికుడి మనమరాలికీ వైభోగంగా వివాహం జరిగింది.

క్షణకాలం, చావు భయంతో అయితేనేం? ఎంతో సాహసంగా ప్రవర్తించినంత మాత్రాన పట్టిన వైభోగం గమనించిన వీరదాసు, ఆ తర్వాత సోమరితనం విడిచి యుద్ధవిద్యలు అభ్యసించి, రాజుగారి సేనానాయకుల్లో ఒకడుగా ఉద్యోగం సంపాయించాడు.






రాముడు అయోధ్య విడిచి, వనవాసానికి బయలు దేరింది చైత్ర శుద్ధ పంచమి నాడు. పధ్నాలుగేళ్లు చైత్రశుద్ధ చవితికి పూర్తి అయ్యాయి. ఆ మర్నాడు అతను భరద్వాజాశ్రమం చేరాడు. అతను భరద్వాజుడికి నమస్కరించి, "స్వామీ, అయోధ్యానగరం సుభిక్షంగా ఉన్నదా? భరతుడు చక్కగా పరిపాలిస్తున్నాడా? మా తల్లులు సుఖంగా ఉన్నారా?" అని అడిగాడు.

దానికి భరద్వాజుడు, "భరతుడు దేహ సంస్కారం లేక, జుట్టు జడలు కట్టి, నీ పాదుకలు ముందుంచుకుని రాజ్యపాలన చేస్తున్నాడు. నీ రాకకోసం ఎదురు చూస్తున్నాడు. అంతా క్షేమంగానే ఉన్నారు," అని చెప్పాడు.

ఆయన రాముణ్ణి ఆ రోజు తన అతిథిగా ఉండి, మర్నాడు అయోధ్యకు వెళ్ళమని కోరాడు.

రాముడు ముందుగా హనుమంతుణ్ణి పంపదలచి, అతనితో, "నువ్వు శృంగిబేరపురానికి వెళ్ళి అక్కడి బోయరాజైన గుహుడితో, నేను శత్రువులను జయించి క్షేమంగా తిరిగి వస్తున్న సంగతి చెప్పు. నాకు అప్తుడైన గుహుడు చాలా సంతోషిస్తాడు. అతను నీకు అయోధ్యకు దారి చెప్పి, భరతుడి విశేషాలు కూడా చెబుతాడు. తరవాత నువ్వు భరతుణ్ణి కలుసుకుని, నా క్షేమం తెలిపి, నేను వనవాసం పూర్తి చేసి సీతాలక్ష్మణ సహితంగా వస్తున్నానని చెప్పు. నువ్వు భరతుడితో సీతా



పహరణం లగాయతు రావణ సంహారం వరకూ విపులీకరించి చెప్పి, అతని ముఖాన ఎలాటి భావాలు గోచరిస్తాయో శ్రద్ధగా గ్రహించు. నేను శత్రువుల నందరినీ జయించి, అంతులేని కీర్తి సంపాదించి, మహాబలవంతులైన స్నేహితులతో వస్తున్నానంటే భరతుడి మనసులో ఎలాటి భావాలు వికారాలు కలుగుతాయో నువ్వు తెలుసుకునిరావాలి. తండ్రి తాతల రాజ్యాన్ని అనుభవిస్తున్న వాడికి దాన్నివిడిచిపెట్టటంచాలా కష్టం. చాలాకాలంగా రాజ్యపాలన చేస్తున్న భరతుడుకి రాజుగా ఉండాలన్న కోరిక ఉంటే, పోనీ అతన్నే హాయిగా పాలించనీ! నువ్వు మాత్రం మేం ఎక్కువ దూరం ప్రయాణం చెయ్యక ముందే తిరిగి రావాలి," అన్నాడు.

రాముడు ఇలా అజ్ఞాపించగా, హనుమంతుడు మనుష్యరూపంలో ఆకాశ మార్గాన అయోధ్యకు వేగంగా బయలుదేరాడు. అతను శృంగిబేరపురం చేరి, గుహుణ్ణి కలుసుకుని, "రాముడు తన క్షేమం నీకు తెలుపమన్నాడు. అతను సీతా లక్ష్మణులతో సహా ఈ రాత్రికి భరద్వాజాశ్రమంలో ఉండి రేపు ఉదయం బయలుదేరుతాడు. త్వరలోనే నువ్వు అతన్ని చూడగలవు," అని అతనితో చెప్పి, తిరిగి ఆకాశమార్గాన అతివేగంగా బయలుదేరి, నందిగ్రామం చేరబోయాడు.

నందిగ్రామం చుట్టూ ఉండే చెట్లు చాలా అందంగా, నందనోద్యానానికి సాటి వచ్చేవిగా ఉన్నాయి. అక్కడికి అయోధ్య రెండు ఘడియల ప్రయాణం. అక్కడ భరతుడు ఆశ్రమం నిర్మించుకుని, జింక తోళ్ళే బట్టలుగా ధరించి, పధ్నాలుగేళ్ళు నిండినా రాముడు ఇంకా రాలేదే అని విచారంగా ఉన్నాడు. అతను స్నానం లేక మట్టి గొట్టుకొని ఉన్నాడు. జుట్టు జడలు కట్టుకుపోయింది. అతను కేవలమూ కందమూల ఫలాలే తింటున్నాడు. ఆ స్థితిలోనే అతను మంత్రులనూ, పురోహితులనూ, సేనాధ్యక్షులనూ వెంట బెట్టుకుని రాజ్యం పాలిస్తున్నాడు. అతని కింద కొలువు చేస్తున్న

వారందరూ కాషాయవస్త్రాలు ధరించి ఉన్నారు.



హనుమంతుడు భరతుణ్ణి చూసి, నమస్కరించి, "రాముడు తన క్షేమం నీకు చెప్పమన్నాడు. నీ విచారం తొలగించే వార్త చెబుతాను. నువ్వు త్వరలోనే రాముణ్ణి చూడగలవు. రాముడు రావణుణ్ణి చంపి, సీతను తిరిగి పొంది, కోరికలన్నీ తీరినవాడై, మహాబలవంతులైన మిత్రులతో సహా వస్తున్నాడు. అతని వెంట సీతా, లక్ష్మణుడూ కూడా వస్తున్నారు," అని చెప్పాడు.

ఈ వార్త వినగానే భరతుడు సంతోషం పట్టలేక మూర్ఛపోయాడు. తరవాత మూర్ఛతేరి అతను హనుమంతుడితో, "అయ్యా, నాకు ఇంత ప్రియమైన వార్త తెచ్చిన నువ్వు మనిషివో, దేవతవో తెలియదు. నీకు బహుమానంగా లక్ష గోవులూ, నూరు గ్రామాలూ, సమస్త ఆభరణాలూ, పధ్నాలుగు చక్కని కన్యలనూ ఇస్తాను," అన్నాడు.

అతను కోరిన మీదట హనుమంతుడు, భరతుడు రామపాదుకలు తీసుకుని చిత్రకూటం నుంచి అయోధ్యకు తిరిగి పోయిన అనంతరం జరిగిన విషయాలన్నీ చెప్పాడు.

భరతుడు అంతా విని పరమానంద భరితుడై, శత్రుఘ్నుడితో, "పురుషులందరూ చక్కగా స్నానం చేసి, పట్టణంలోని చతుష్పథ మంటపాలలో దేవతలనందరినీ సుగంధ పుష్పాలతోనూ, వాద్యాలతోనూ పూజించేటట్లు చూడు. రాముణ్ణి చూడటానికి వైతాళికులు, బాజాభజంత్రీలతో గుంపులు గుంపులుగా బయలుదేరాలి," అని ఆజ్ఞాపించాడు.

శత్రుఘ్నుడు అనేక వేలమంది సేవకులను పిలిపించి, "మీరు నందిగ్రామం నుంచి అయోధ్య దాకా గల దారిని మిట్టపల్లాలు లేకుండా చదును చెయ్యండి. కొందరు దారి పొడుగునా మంచులాంటి చల్లని నీరు చల్లి, పైన మెత్తటి పూలు పరచండి. తెల్లవారే లోపల అయోధ్యలో ముఖ్యమైన వీధు

లన్నిటినీ, ఇళ్ళనన్నిటినీ అలంకరించాలి. విశాలమైన రాజమార్గం పొడుగునా పూల తోరణాలు కట్టి, పూలూ, గంధమూ చల్లి, అయిదు రంగుల చూర్ణాలతో ముగ్గులు పెట్టాలి," అని ఆజ్ఞాపించాడు.

రాణులూ, మంత్రులూ, సైనికులూ, వాళ్ళ భార్యలూ, బ్రాహ్మణులూ, క్షత్రియులూ, గణనాయకులూ, గణాలవారూ రాముణ్ణి చూడటానికి బయలుదేరారు. కొందరు ఏనుగుల మీదా, కొందరు రథాల మీదా వెళ్ళారు. సైనికులు రకరకాల ఆయుధాలు పట్టుకుని నడిచారు. ధృష్టీ, జయంతుడూ, విజయుడూ, సిద్ధార్థుడూ, అర్థసాధకుడూ, అశోకుడూ, మంత్రపాలుడూ, సుమంతుడూ అనే మంత్రులు బయలుదేరారు. దశరథుడి భార్యలు వాహనాలలో నందిగ్రామం చేరారు.

భరతుడు రామ పాదుకలు నెత్తిన పెట్టుకుని రాముడికి ఎదురు బయలుదేరాడు. అతని వెంట బ్రాహ్మణులూ, వర్తకులూ, పురప్రముఖులూ, దండలు చేతబట్టుకుని మంత్రులూ, స్తోత్ర పాఠకులూ బయలుదేరారు. భరతుడి వెంట రాజ చిహ్నాలయిన ఛత్ర, చామరాలూ, బంగారు దండమూ వెళ్ళాయి.

ఎంతసేపటికీ రాముడు ఎదురు రాకపోయేసరికి భరతుడు హనుమంతుడితో, "వానర బుద్ధికారణంగా రాముడు వస్తున్నాడని చెప్పావా ఏం? ఏడీ రాముడు? కనిపించడేం?" అని అడిగాడు.



"భరద్వాజ మహాముని వానర సేనలకు బ్రహ్మాండమైన విందు చేశాడు. ఆయన ఆశ్రమంలో చెట్లన్నీ ఫలపుష్పాలతో నిండి, వానరులకు ఉత్సాహం కలిగించాయి. వాళ్ళ కోలాహలం వినిపిస్తున్నది. వాళ్ళు ఇప్పుడు గోమతీ నదిని దాటుతున్నట్లు తోస్తున్నది. అదిగో పుష్పకం! దూరాన కనిపిస్తున్నది. ఒకప్పుడు కుబేరుడిదైన ఈ విమానం ఇప్పుడు రాముడిదయింది. అందులో రాముడితోబాటు సీతాదేవీ, లక్ష్మణుడూ, వానర రాజైన సుగ్రీవుడూ, రాక్షస రాజైన విభీషణుడూ ఉన్నారు," అని హనుమంతుడు భరతుడితో అన్నాడు.

వెంటనే, "అడుగో, రాముడు! వస్తున్నాడు!" అన్న కేకలు మిన్ను ముట్టాయి. రాముణ్ణి చూడటానికి వచ్చిన వారందరూ నిలబడ్డారు.

రాముడు రానే వచ్చాడు. తన ఎదురుగా నిలబడిన రాముడికి నమస్కారం చేసి, భరతుడు, "అన్నమాట తప్పకుండా మా అందరికి శుభం కలిగే లాగు వచ్చావు," అని పొగిడాడు.

రాముడు భరతుణ్ణి విమానంలో ఎక్కించుకుని, ఆనందంతో కౌగిలించుకున్నాడు. భరతుడు లక్ష్మణుణ్ణి పరామర్శించి, సీతకు నమస్కారం చేశాడు. అతను వానర వీరులందరినీ కౌగిలించుకున్నాడు. అతను సుగ్రీవుడితో, "నువ్వు మా నలుగురు అన్నదమ్ములకూ అయిదో వాడివి అయ్యావు. ఉపకారం చేసిన వాడు





మిత్రుడవుతాడు," అని విభీషణుడితో, "నువ్వు మాకు చాలా గొప్ప సహాయం చేశావు," అన్నాడు.

శత్రుఘ్నుడు రామ, లక్ష్మణులకు నమస్కారం చేసి, సీత పాదాలకు వందనం చేశాడు. రాముడు తన తల్లిని చూడబోయి, ఆమెపాదాలకు భక్తితో నమస్కారం చేశాడు. తరవాత సుమిత్రకూ, కైకేయికీ, వసిష్ఠుడికీ నమస్కారం చేశాడు. పౌరులందరూ రాముడికి సంతోషంగా స్వాగతం పలికారు.

భరతుడు రాముడి పాదుకలను తన చేత్తోనే రాముడి కాళ్ళకు తగిలించాడు. అతను రాముడితో, "ఇన్నాళ్ళూ నేనే చూస్తూ ఉండిన నీ రాజ్యాన్ని తిరిగి నీకు ఇచ్చేశాను. నువ్వు మళ్ళీ అయోధ్యకు తిరిగి రావటం కళ్ళారా చూశాను గనక, నా జన్మ సార్థకమయింది. నా కోరిక నెరవేరింది," అన్నాడు.

రాముడు విమానంలోనే నంది గ్రామం చేరాడు. అక్కడ అతను తన వెంటవున్న వారందరితోపాటు విమానం నుంచి దిగి, ఆ విమానాన్ని కుబేరుడి దగ్గరికి వెళ్ళిపొమ్మన్నాడు.

రాముడి పట్టాభిషేకానికి ముహూర్తం నిర్ణయమయింది. రామ, లక్ష్మణ, భరతులు క్షురకుల చేత క్షౌరం చేయించుకున్నారు. భరతుడూ, లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, విభీషణుడూ, రాముడూ వరసగా మంగళ స్నానాలు చేశారు. రాముడు పుష్పమాలలు ధరించి, శరీరానికి చందనం పూయించుకుని, పచ్చని పట్టుబట్టలు కట్టుకుని సింహాసనం మీద కూర్చున్నాడు. శత్రుఘ్నుడు రామ, లక్ష్మణ, భరతులకు హారాలూ, కేయూరాలూ, ఇతర ఆభరణాలు తొడిగి అలంకరించాడు. దశరథుడి భార్యలు సీతను ఎంతోచక్కగా అలంకరించారు.

సుమంత్రుడనే సారథి రాముడి కోసం రథం తెచ్చి, అందులో రాముణ్ణి ఎక్కించుకున్నాడు. సుగ్రీవుడూ, హనుమంతుడూ శుభ్రంగా స్నానాలు చేసి, మంచి బట్టలూ, ఆభరణాలూ ధరించి, సంతోషంగా

అయోధ్యకు బయలుదేరారు. దశరథుడి మంత్రులు ముందుగానే అయోధ్యకు పోయి, వసిష్ఠుడితో సంప్రతించి, పట్టాభి షేక సన్నాహాలు చేశారు.

రాముడు తనకు సుగ్రీవుడితో మైత్రీ, హనుమంతుడి ప్రభావమూ, విభీషణుడు తన పక్షం వచ్చెయ్యటమూ చెప్పితే, పౌరులు ఆశ్చర్యపోయారు. రాముడు దశ రథుడి మందిరం ప్రవేశించాడు. రాముడి మందిరం, సుగ్రీవుడికి విడిదిగా ఏర్పాటు చేయబడింది.

సుగ్రీవుడు నాలుగు బంగారు కలశా లను నలుగురు వానరోత్తములకిచ్చి, "రేపు తెల్లవారే సరికి, మీరు నాలుగు సముద్రాల జలంతోనూ సిద్ధంగా ఉండాలి," అని ఆజ్ఞాపించాడు.

జాంబవంతుడూ, హనుమంతుడూ, వేగదర్శి, ఋషభుడూ కలశాలు తీసుకుని, అయిదు వందల నదుల జలాలు తెచ్చారు. నాలుగు సముద్ర జలాలు కూడా వచ్చేశాయి.

తరవాత శాస్త్రోక్తంగా రాముడి పట్టాభి షేకం జరిగింది. రాముణ్ణీ, సీతనూ రత్న ఖచితమైన పీఠంమీద కూర్చోబెట్టారు. తర వాత ఋత్వికులూ, బ్రాహ్మణులూ, కన్య కలూ, పౌరులూ, యోధులూ ఒకరి తరవాత ఒకరు రాముణ్ణి అభిషేకించారు.

రాముడికి శత్రుఘ్నుడు తెల్లగొడుగు పట్టాడు. సుగ్రీవుడు వింజామర వీచాడు. విభీషణుడు మరొక వింజామర వీచాడు.

తన పట్టాభిషేక సందర్భంలో రాముడు బ్రాహ్మణులకు దూడలతో సహా గోవులనూ, బంగారాన్నీ, బట్టలనూ దానం చేశాడు. అతను సీతకు ఒక ముత్యాల హారం ఇచ్చి, వానరులలో తనకు ఎక్కువ అభిమానం గల వాడికి దాన్ని ఇయ్యమన్నాడు. సీత వెంటనే దాన్ని హనుమంతుడికి ఇచ్చింది. తరవాత రాముడు ఇతర వానరవీరులకు బహుమానాలిచ్చాడు.

విభీషణుడు లంకకు తిరిగి వెళ్ళాడు. తరవాతరాముడుభరతుణ్ణియువరాజుగా చేసి, రాజ్యపాలన చేయసాగాడు.





# అచ్చిరాని పాలెకాపు

చైనాలో ఒక మారుమూల గ్రామంలో ఒక భూస్వామి ఉండేవాడు. ఆయన పరమ కర్కోటకుడు. ఆయన కింద ఏ పాలెకాపూ ఎక్కువరోజులు పనిచేయలేకపోయేవాడు. ఈయనవాళ్లచేత పనిచేయించుకున్నన్నాళ్లు హాయిగా పనిచేయించుకుని, తాను చెప్పిన పని సరిగా చెయ్యలేదని మిషపెట్టి నానా తిట్లు తిట్టి ప్రతివాణ్ణీ కానీ డబ్బివ్వకుండానే పనిలోనుంచి పంపేస్తూ వుండేవాడు.

భూస్వామి దుష్ట స్వభావం తెలిసినవాళ్ళు గనక, ఆ వూళ్లో ఆయనకింద ఎవరూ పని చేసేవాళ్లు కారు.

అయినా, పొరుగూళ్ల నుంచి అమాయకులు వచ్చి కొంతకాలం భూస్వామి దగ్గిర పని చేసి డబ్బులు ముట్టకుండానే వెళ్లిపోతూండేవాళ్లు.

ఒకనాడు దూరపు గ్రామం నుంచి చాలా అమాయకుడిలాగా కనిపించే ఒక కుర్రవాడు వచ్చి భూస్వామి ఇంట పని చేయటానికి కుదిరాడు.

"అబ్బాయీ, నీకు ముందే చెప్పటం మంచిది. నేను చెప్పిన పనులు చెప్పినట్లు సక్రమంగా చెయ్యక పోయావో నీకు కానీ కూడా ఇవ్వను సరికదా, పనిలోనుంచి ఆ క్షణమే పంపేస్తాను. తరవాత విచారించి లాభం లేదు. ముందే బాగా ఆలోచించుకో, తెలిసిందా?" అన్నాడు భూస్వామి.

"దానికేం భాగ్యం లేండి! చెప్పిన పని చెయ్యక పోవటం తప్పేగా?" అన్నాడు కొత్త పాలెకాపు.

వాడు పనిలోచేరి కోడి కూసింది మొదలు చీకటి పడినదాకా ఒళ్లు దాచుకోకుండా పని చేస్తూ వచ్చాడు.

ఒకనాడు భూస్వామి పాలెకాపును పిలిచి, "ఒరే, కొండమీది వెదురు పొదలు ఆకు తొడిగాయి గాని, రేపు మన ఎద్దును

చీనా జానపద కథ

తోలుకుపోయి వెదురు చిగుళ్లు మేపుకురా. నువ్వు వెదురు చిగుళ్లు కోసి ఎద్దు నోటికి అందించేవు సుమా, దాన్ని హాయిగా మెయ్యనీ!" అన్నాడు.

"దానికేం భాగ్యం లేండి?" అన్నాడు పాలెకాపు.

మర్నాడు ఉదయమే వాడు ఎద్దుని తోలుకుని తిన్నగా కొండమీది వెదుళ్లపొదల దగ్గరికి తీసుకునిపోయి, దాన్ని ఒక వెదురు వాసానికి కట్టేశాడు. తరవాత వాడు దాన్ని ఒక పెద్ద బెత్తంతో బాదుతూ, "పైకెక్కు! ఎక్కవేం?" అని గట్టిగా అరవసాగాడు.

దెబ్బలకు తట్టుకోలేక, పాపం, ఎద్దు వెదురు వాసం చుట్టు అటూ ఇటూ పరిగెత్త సాగింది.

ఆ దారిన వెళ్లేవాళ్లు ఇదంతా చూసి తమలో తాము నవ్వుకున్నారు. త్వరలోనే ఈ సంగతి భూస్వామికి తెలిసింది. ఆయన హడావుడిగా పరిగెత్తుకుంటూ వచ్చి, "ఆ ఎద్దును కాస్తా చంపేస్తావట్రా?" అని అడి గాడు కోపంగా.

"మీకు తెలియదు, ఊరుకోండి, సామీ? దీని కింత పొగరా? పైకెక్కి చిగుళ్లు మెయ్యవే అంటే ఎక్కదు! చావగొడితే గాని దానికి బుద్ధిరాదు!" అన్నాడు పాలెకాపు.

"చాల్లే, చాల్లే! నువ్వు దానికి వెదురు చిగుళ్లు మేప వద్దు. ఇంటికి తీసుకుపో!" అన్నాడు భూస్వామి.

ఇదిజరిగినప్పటి నుంచీ ఆయనకు పాలె కాపు మీద చెప్పలేనంత కచ్చగా ఉంది.



వాణ్ణి ఎట్లాగైనా ఏదో సాకు చెప్పి డబ్బివ్వ కుండా పంపెయ్యాలని ఆయన నిశ్చ యించుకున్నాడు. ఆ సాకు కోసం తల పగలగొట్టుకోనారంభించాడు.

ఒకనాడాయన తన పాలెకాపుతో, "మన ఇంటిపైన ఉన్న పెంకుల కప్పు చూశావట్రా, అది ఎంతో విశాలంగా ఉందిగాని ఎందుకూ పనికిరాకుండా ఉంది. కాబట్టి రేపు పొద్దున దానిమీద నువ్వు కూరల మొక్కలు నాటు!" అన్నాడు.

"దానికేం భాగ్యం లేండి!" అన్నాడు పాలెకాపు.

మర్నాడు తెల్లవారుతూనే వాడొక గునపం తీసుకుని ఇంటికప్పు పైకెక్కి పెంకు లన్నిటినీ పగలగొట్టసాగాడు. కొన్ని పెంకుల తునకలు ఇంట్లో నిద్రపోతున్న భూస్వామి పైన పడ్డాయి. ఆయన ఉలిక్కిపడి నిద్ర లేచి గబగబా బయటికొచ్చి తల ఎత్తి చూసి, "పెంకుల్ని అలా పగల గొట్టేస్తు న్నావు, నీకేం పోయ్యేకాలం రా," అన్నాడు పళ్లు కొరుకుతూ.

"మీకేం తెలీదు, ఉండండి! మొక్కలు నాటడానికి కప్పంతా చుప్తాగా తవ్వేస్తు న్నానూ!" అన్నాడు పాలెకాపు.

"ఒరే, నీకు ఎంతో పుణ్యం ఉంటుంది! నువ్వు మొక్కలు నాటవద్దులే. ముందు కప్పు దిగిరా!" అన్నాడు భూస్వామి ప్రాధేయ పడుతున్నట్లు.

ఇటువంటి వాడితో ఏం చెయ్యాలో భూస్వామికి తెలియలేదు.



ఎండాకాలం వచ్చింది. నీరు చాలక భూస్వామి పొలాలలో వేసిన వేసవి పంటలు దెబ్బతింటున్నాయి.

అలాటి పరిస్థితిలో భూస్వామి తన పాలెకాపుతో, "ఒరే, ఎండదెబ్బకి మన చేలు మలమలా మాడిపోతున్నాయి గాని; రేపు ఉదయమే మన పొలాలన్నిటినీ తెచ్చి భద్రంగా ఇంట్లో పెట్టు!" అన్నాడు.

ఈ దెబ్బతో పాలెకాపు వదిలిపోతాడని భూస్వామి అనుకున్నాడు.

"ఓ అదెంత భాగ్యం లేండి!" అన్నాడు పాలెకాపు.

మర్నాడు భూస్వామి లేచేసరికి ఆయనకు పక్కన ఎవరో పెద్ద చప్పుడు చేస్తూండటం వినిపించింది. ఆయన బయటికి వచ్చాడు.

పాలెకాపు పెద్దపలుగు తీసుకుని ఇంటి ముందుగోడను చకచకా పడగొట్టేస్తున్నాడు. అప్పటికే ద్వారబంధాన్ని తీసి అవతల పారేశాడు. పెద్ద గోడ కొంచెం కొంచెమే పడిపోతున్నది.

"ఏం చేస్తున్నావురా, పశువా? నీకేమైనా మతిపోయిందా! ఆగు!" అన్నాడు భూస్వామి పట్టరాని కోపంతో.

"మీకేమీ తెలీదు, ఊరుకోండి!" అంటూ పాలెకాపు గోడను సాంతం పడగొట్టటంలో నిమగ్నుడయ్యాడు.

"ఆ పని మాన్తావా, మానవా?" అని భూస్వామి గద్దించాడు.

"మరి పొలాలను ఇంటికి తెమ్మంటిరిగా?" అన్నాడు పాలెకాపు.

"ఇల్లంతా పడగొట్టమన్నానా?" అన్నాడు భూస్వామి.

"ఈ ముందు గోడన్నా అడ్డం తియ్యకపోతే మరి అంత పెద్ద పొలాలను ఇంట్లోకి చేర్చటం ఎట్లా?" అన్నాడు పాలెకాపు ఎంతో అమాయకంగా.

ఈ దెబ్బతో భూస్వామికి బుద్ధి వచ్చింది. ఈ పాలెకాపు ముందు తన ఎత్తులు పారవనుకున్నాడు. తరవాత ఆయన పాలెకాపుకు బోలెడంత డబ్బిచ్చి వాణ్ణి వదిలించుకున్నాడు.



## ఎవరెస్టు శిఖరంపై స్త్రీలు

ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించిన మొట్టమొదటి వనిత ఎవరు? జపానుకు చెందిన జుంకో టాబీ. ఎవరెస్టును అధిరోహించిన మొట్టమొదటి భారతీయ వనిత ఎవరో తెలుసా? బచేంద్రిపాల్. ప్రపంచంలో కెల్లా ఆ శిఖరాన్ని రెండుసార్లు అధిరోహించిన స్త్రీ మన దేశానికి చెందిన సంతోష్ యాదవ్. 1993 వసం॥ మే 10వ తేదీ ఈ ఘనతను సాధించింది. ఆమె 1992 వసం॥ మొట్టమొదట ఎవరెస్టును అధిరోహించింది. ఆమె రెండవసారి వెళ్ళినప్పుడు, ఆమెతో పాటు ఆ రోజు కుంగ్ భుటీయా, డిక్కీడోల్మా అనే ఇద్దరు యువతులు కూడా వెళ్ళారు. అందరూ యువతులే పాల్గొన్న



మొట్ట మొదటి పర్వాతారోహణ అది. ఒకవారం తిరిగేలోగా అంటే మే 16 వ తేదీ బచేంద్రిపాల్ నాయకత్వంలోదీపుశర్మ, రాధాదేవి, సుమన్‌కుటియాల్, సవితా మార్టోలియా అనే నలుగురు యువతులు ఎవరెస్టుశిఖరం చేరి మరొక రికార్డు సృష్టించారు. ఆరోజే అంటే మే 16న స్పానిష్ పర్వతారోహణ బృందానికి చెందిన నేపాల్‌షెర్పా- ఆంగ్‌రీటా తొమ్మిదవసారిగా ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించాడు. 1983 వ సం॥లో తొలిసారిగా ఎవరెస్టును అధిరోహించిన ఆంగ్‌రీటా 1984, 1985, 1987, 1988, 1990, 1992వ సం॥ రాలలో మళ్ళీ మళ్ళీ ఎవరెస్టును అధిరోహించాడు. అతని రికార్డును అధిగమించడం అంత సులభంకాదు!

## ఆకాశంలో ఆహారాల ప్రకటన!

ఆకాశంలో పెద్ద పెద్ద బెలూన్లు ఎగరవేసి, వాటి మీద వ్యాపార ప్రకటనలు చేయడం ఇవాళ సర్వసాధారణమైన విషయం. వీటి ద్వారా ప్రజలందరి దృష్టినీ చాలా సులభంగా ఆకర్షించవచ్చు. త్వరలో ఒక మైలు పొడవుగల 'బిల్‌బోర్డ్' ను ఆకాశంలో ఎగరవేయడానికి ఒక అమెరికా వర్తక సంస్థ పూనుకున్నది. వ్యతిరేకించే వాళ్ళు దీనినొక 'భయంకర' విషయంగా విమర్శిస్తున్నారు. అయినప్పటికీ విచిత్రమైన ఆహారాల ప్రకటన త్వరలో గగనతలంలో సాక్షాత్కారం కానున్నది!

## 'సమ్మె' చేసిన గడియారం!

లండన్‌నగరం 'వెస్ట్ మినిస్టర్' లోని 'బిగ్ బెన్' గడియారం ఘంటానాదం ప్రపంచప్రసిద్ధి గాంచినది. పదిహేను నిమిషాల కొకసారి, ముప్పై నిమిషాల కొకసారి, నలభై అయిదు నిమిషాల కొకసారి, గంటకొకసారి శ్రావ్యమైన ఘంటానాదం చేయడానికి ఇందులో ప్రత్యేకమైన గంటలు అమర్చబడి ఉన్నాయి. ఇటీవల ఎనిమిది వారాల పాటు పావుగంట కొకసారి మ్రోగే గంటలు ఆగిపోయాయి. సాంకేతిక నిపుణులు వచ్చి లోపలి 'గియర్ చక్రం' మార్చడంతో అది మళ్ళీ పనిచేయడం ప్రారంభించింది. అయితే, మే 19 వ తేదీ సాయంకాలం 6-11 నుంచి 9-25 వరకు ఎటువంటి గంటల చప్పుడూ వినిపించలేదు. ఈ సమ్మెకు కారణం ఏమిటా అని ఇంజనీర్లు ఆలో



చిస్తూండగా అది తానంతట యథాప్రకారం మళ్ళీ మోగడం ప్రారంభించింది!




# బ్రహ్మముడి

పూర్వం కాశీనగరంలో రాజపాలుడనే యువకుడొకడుండేవాడు. అతనికి పసితనంలోనే తల్లి దండ్రులు పోయారు. అతను ఉన్నతోద్యోగుల సహకారంతో శ్రద్ధగా చదువుకుని, దివాణంలో ఒక ఉద్యోగం కూడా సంపాదించాడు.

ఉద్యోగం వచ్చాక రాజపాలుడికి పెళ్ళి మీద బుద్ధి మళ్ళింది. తల్లిదండ్రులున్నట్టయితే అతనికి అదివరకే పెళ్ళి అయి ఉండేది. ఈ పాటికి భార్య కాపురానికి వచ్చి, సంసారం ఏర్పాటై ఉండేది. భార్య లేని కారణం చేత అతనింకా సత్రంలో భోజనమూ, మఠంలో నిద్రా అన్నట్లుగా జీవితం గడపవలసి వచ్చింది.

ఇతరుల సహాయం లేకుండా పెళ్ళాడటం సాధ్యం కాదని తెలుసుకుని, రాజపాలుడు తన మిత్రుడొకడితో తన మనసులో ఉన్నమాట చెప్పుకున్నాడు.

“ఫలాని న్యాయాధికారిగారి కొక పెళ్ళి కావలసిన కూతురున్నది. అన్ని విధాలా నీకు తగిన పిల్ల. ఇవాళ రాత్రే నేను వారికి నీ విషయం చెప్పి, శత విధాలా వారిని ఒప్పిస్తాను. రేపు అరుణోదయపు వేళకు మణికర్ణికా ఘట్టం వద్ద మెట్ల మీద మనం కలుసుకుందాం. నీవక్కడికిరా. నాప్రయత్నం ఏమయినదీ నీకు చెబుతాను,” అన్నాడు మిత్రుడు.

ఆ రాత్రి రాజపాలుడికి కన్ను మూత పడలేదు. నాలుగో జాము ఆరంభంలోనే అతను బయటికి చూసి, అప్పుడే తెల్లవారిపోయిందనుకుని, గబగబా మణికర్ణికా ఘట్టానికి బయలుదేరాడు.

అతను ఉదయ కాంతి అనుకున్నది వెన్నెల. మణికర్ణికా ఘట్టం నిర్జనంగా ఉన్నది. రాజపాలుడు తన స్నేహితుడి కోసం చాలాసేపు వేచి ఉండవలసి వస్తుం

దనుకుంటూండగా, దూరాన మెట్ల మీద ఎవరో కూర్చుని ఉండటం కనబడింది. ఆ మనిషితో కబుర్లు చెబుతూ కాస్సేపు కాలక్షేపం చెయ్యవచ్చు గదా అని రాజపాలు డాయనను సమీపించాడు.

మెట్ల మీద కూర్చుని ఉన్నవాడు వృద్ధుడు. ఆయన వెన్నెల కాంతిలో పత్రాల పైన ఏదో దీక్షగా రాస్తున్నాడు. రాజపాలుడు ఆ వృద్ధుడి వెనక తొంగి చూశాడు. కాని వృద్ధుడు రాస్తున్న లిపి చాలా వింతగా ఉన్నది.

"తాతగారూ, నేను అనేక లిపులు ఎరుగుదును. మీరు రాస్తున్న లిపి ఏమిటో నాకేమాత్రం బోధపడ లేదు," అన్నాడతను వృద్ధుడితో.

వృద్ధుడు తల ఎత్తిచూసి, "నీకెలా అర్థ మవుతుంది? ఇది బ్రహ్మలిపి," అని మళ్ళీ తన రాతలో నిమగ్నుడయ్యాడు.

"తమరు రాసేదేమిటి?" అన్నాడు రాజ పాలుడు.

"సూర్యోదయం లోపుగా పుట్టేవాళ్ళ జాతకాలు," అన్నాడు వృద్ధుడు తల ఎత్త కుండానే.

ఆ వృద్ధుడే బ్రహ్మ అయి ఉంటాడా అని రాజపాలుడికి అనుమానం వేసి, అంతులేని ఆశ్చర్యం కలిగింది.

కొంతసేపటికి వృద్ధుడు రాయటం పూర్తి చేసి, పత్రాలు కట్ట గట్టి ఒక పక్క పెట్టి,



రెండో పక్క నుంచి ఒక సంచీ తీసి, అందులో నుంచి ఎర్ర పోగులూ, తెల్ల పోగులూ తీసి వాటికి ముడులు వెయ్య నారంభించాడు.

"తాతగారూ, ఆ దారాలేమిటి? మీరు వేసే ఈ ముళ్ళేమిటి?" అని రాజపాలుడడిగాడు.

"బ్రహ్మముళ్ళు. ఏ పురుషుడికి ఏ ఆడది రాసిపెట్టి ఉన్నదో వాళ్ళకు ముళ్ళు పెట్టే స్తున్నాను," అన్నాడు వృద్ధుడు తల ఎత్త కుండా, దీక్షగా తన పని తాను చూసు కుంటూ.

"అయితే, నాకు ఎవరు ముడి పడి ఉన్నదీ తమకు తెలిసే ఉంటుంది. మరి కాస్సేపటిలో నా వివాహం స్థిరమైనట్లు వార్త



వస్తుందని నా మిత్రుడి కోసం ఎదురు చూస్తున్నాను," అన్నాడు రాజపాలుడు ఎంతో ఉత్సాహంగా.

వృద్ధుడు తల ఎత్తి అతని కేసి చూసి, "నీ పెళ్ళి ఇంతలో జరగదు. నీకు కాబోయే భార్య ఇప్పుడింకా మూడేళ్ళ పిల్ల. ఆ పిల్లకు పదిహేడో ఏడు వచ్చేదాకా మీ ఇద్దరికీ వివాహం జరగదు," అన్నాడు.

"ఇంకా పద్నాలుగేళ్ళ దాకా నా పెళ్ళి కాదా? ఎంత దారుణం! నేను నమ్మను," అన్నాడు రాజపాలుడు.

"అలా చూడూ, ఆ వచ్చే ఒంటి కన్ను దాని చంకనున్నదే నీకు కాబోయే భార్య," అన్నాడు వృద్ధుడు.

రాజపాలుడు గబగబా మెట్లెక్కి వచ్చి ముసలిదాన్ని సమీపించాడు. ఈ ముసలి దానికి ఒక కన్ను గుడ్డి; కుళ్లు గుడ్డలు కట్టుకుని ఉన్నది. అది పిల్లని పైమెట్టు పైన మెల్లగా కూర్చోబెట్టి, గంగలో స్నానం చెయ్యటానికి గబగబా మెట్లు దిగి వెళ్ళింది. ఆ పిల్లకు మూడేళ్ళ వయసే ఉంటుంది. ఆ పిల్ల ఆ ఒంటి కన్ను ముసలిదాని కూతురై ఉంటుంది.

ఆ పిల్ల తనకు భార్య అవుతుందంటే రాజపాలుడికి భరించరాని రోత కలిగింది. వృద్ధుడి కోసం చూస్తే ఎక్కడా కనబడ లేదు. ఆ వృద్ధుడి మాటలు నమ్మాలో, నమ్మరాదో రాజపాలుడు ఆ క్షణంలో నిర్ణ యించుకోలేకపోయాడు.ఆ పిల్లను చంపేస్తే గాని అతనికి మనస్సు స్థిమిత పడేటట్లు లేదు.

అతను తన మిత్రుడి కోసం ఇంక వేచి ఉండ దలచలేదు. అతను తలపెట్టిన పని నెరవేరి ఉంటే, అతడు తనను కలుసుకునే వాడే. పని జరిగి ఉండదు.

అలా అనుకుని రాజపాలుడు ఊళ్ళోకి బయలుదేరాడు. కొద్ది దూరం వెళ్ళేసరికే అతనికి తెలిసిన దివాణం నౌకరొకడు కని పించాడు. రాజపాలుడు వాణ్ణి దగ్గిరికి పిలిచి, "ఒరే, చిన్నపిల్ల రూపంలో ఒక పిశాచి ఉన్నది. ఇప్పుడే వెళ్ళి నువ్వు దాన్ని కత్తితో పొడిచి చంపావంటే నీకు పది

వరహాలు బహుమానమిస్తాను, ఏమంటావు?" అన్నాడు.

"పిశాచిని చంపాలిసిందే. అది ఎక్కడ ఉన్నదో చూపించండి, ఇప్పుడే చంపి వస్తాను," అన్నాడు నౌకరు.



రాజపాలుడు వాణ్ణి వెంటబెట్టుకుని వెనక్కు వచ్చేసరికి, ఒంటికంటిది స్నానం పూర్తిచేసి పిల్ల నెత్తుకుని నది నుంచి వెళ్ళిపోతూ కనబడింది. "అదుగో, ఆ మనిషి చంకలో ఉన్న పిల్లే! నీ పని పూర్తిచేసి నా దగ్గరికి రా!" అని చెప్పి రాజపాలుడు, శిశుహత్య కళ్ళారా చూడలేక అక్కడి నుంచి త్వరగా వెళ్ళిపోయాడు.

నౌకరు ముసలిదాన్ని కలుసుకుని, దాని వెనకనే నడుస్తూ, చల్లగా కత్తి పైకి తీసి, పిల్లను పొడవబోయే సమయానికి, ముసలిదాని చంకలో ఉన్న పిల్ల దైవికంగా వాడికేసి పెద్ద కళ్ళతో చూసింది. ఆ కళ్ళు చూస్తే నౌకరుకు ఆమె మామూలు పిల్లే అనిపించింది. ఆ పిల్లను హత్య చెయ్యటానికి వాడికి చేతులాడక, ఎత్తిన కత్తితో పిల్ల కనుబొమ్మ మీదుగా చిన్న గాటుపెట్టి, కాలి సత్తువ కొద్దీ అక్కడి నుంచి పారిపోయాడు.

వాడు తరవాత రాజపాలుడి వద్దకు వెళ్ళి, పిశాచిని చంపానని చెప్పి, తన బహుమానం తాను పుచ్చుకుని వెళ్ళి పోయాడు.

రాజపాలుడు శిశుహత్య చేయించినందుకు బాగానే పశ్చాత్తాపపడ్డాడు గాని, తనకా అలగాపిల్ల భార్య కాకుండా తప్పిపోయినందుకు చాలా సంతోషించాడు. అతను పెళ్ళాడటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడుగాని, ఒక్కటీ కలిసిరాలేదు. ఏళ్ళు దొర్లిపోయాయి, రాజపాలుడు ఉద్యోగంలో కూడా పైకి వచ్చాడు.

పధ్నాలుగేళ్ళు గడిచాయి. రాజపాలుడి పైన ఒక కొత్త న్యాయాధికారి వచ్చాడు. పనిలో రాజపాలుడి సమర్థతా, నిజాయితీ చూసి ఆయన చాలా సంతోషించి, అతని కింత వయసు వచ్చినా ఇంకా పెళ్ళికాలేదని విని ఆశ్చర్యపడ్డాడు.

"పెళ్ళి చేసుకుందామని ఎంతో కాలంగా చూస్తున్నాను. అయినా ఒక్క ప్రయత్నమూ

కలిసి రాలేదు," అన్నాడు రాజపాలుడు విచారంగా.

"నాకు పెళ్ళి ఈడు కూతురున్నది. చాలా అందగత్తె. బాగా చదువుకున్నది. పని పాటలలో సమర్థురాలు. ఆమెను చేసుకో," అన్నాడు అధికారి.

రాజపాలుడుసంతోషంగాఒప్పుకున్నాడు. అధికారి కుమార్తెను అతనికిచ్చి పెళ్ళి చేశాడు. ఒంటినిండా రత్నాభరణాలు దిగ వేసుకుని పెళ్ళికూతురు అపరమోహిని లాగుంది. ఆమె కాపురానికి వచ్చాక రాజ పాలుడికి జీవితం స్వర్గతుల్యంగా అయింది. అయితే, తన భార్య తన జుట్టును నుదుటిలో కుడి భాగం కప్పుకునేలాగా దువ్వుకుని, అక్కడ ఒక ఆభరణం అమర్చుతూ ఉంటుంది. మిగిలిన నగలన్నీ పెట్టెలోదాచి నప్పుడు కూడా ఆమె ఆ ఆభరణాన్ని తియ్యదు.

దీన్నిగురించి రాజపాలుడొకసారి ప్రశ్నిస్తే ఆమె, "నేను మూడేళ్ళదాన్నయి ఉండగా ఒక దుర్మార్గుడు నన్ను కత్తితో పొడిచి చంపాలని ప్రయత్నించి, నుదుటి మీద చిన్న గాటు పెట్టి పారిపోయాడు. ఆ మచ్చ వికారంగా ఉంటుందని జుట్టు ఇలా దువ్వు కుంటాను," అన్నది.

రాజపాలుడు నిర్ఘాంతపోయి, "అయితే ఆ రోజు నిన్ను నది దగ్గిరకు ఎత్తుకు వచ్చిన ఒంటికంటిది మీ అమ్మ కాదా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు ఆమె మరింత నిర్ఘాంత పోయి, "ఆ మనిషి మీకెలా తెలుసు? అది నన్ను పెంచిన దాది. నేను ఈ అధికారి సొంతకూతురును కాను, అన్నకూతురును. నాక్కూడా మీలాగే చిన్నతనంలోనే తల్లి దండ్రులు పోయారు. ఆ ఒంటికంటి దాదే నన్ను పెంచింది. మా పిన తండ్రి నన్ను పెంపుడు చేసుకున్నాడు," అని చెప్పింది.

రాజపాలుడు ఏమీ దాచకుండా తన భార్యతో జరిగినదంతా చెప్పాడు. ఆమె అతని దుస్సంకల్పాన్ని గురించి ఆగ్ర హించక, "అయితే మీరానాడు మణికర్ణికా ఘట్టంలో చూసినది నిజంగా బ్రహ్మదేవుడే అయి ఉంటాడు," అన్నది.



## ప్రకృతి వింతలు :

### కొబ్బరి చెట్లు

చెట్టులోని ప్రతి భాగమూ ఉపయోగపడడం వల్ల కొబ్బరిచెట్టును కల్పవృక్షం అనీ, ఆకుపచ్చ బంగారం అనీ అంటారు. లేత కొబ్బరి నీళ్ళు విటమినులూ, ఖనిజలవణాలూ నిండిన బలవర్ధక పానీయం. లేతకొబ్బరిని అలాగే తింటారు. రకరకాల వంటలకు ఉపయోగిస్తారు. ఎండు కొబ్బరి నుంచి నూనె తీస్తారు. అది ముఖ్యమైన వంట నూనె. కొబ్బరి నూనె శిరోజాలకు చాలా మంచిది. సబ్బులూ, అలంకరణవస్తువులూ, మందులూ తయారుచేయడానికి కొబ్బరి నూనె ఉపయోగపడుతుంది. పిప్పిని పశువుల దాణాగా ఉపయోగిస్తారు. కొబ్బరి పెంకులతో రకరకాల



బొమ్మలూ, వస్తువులూ తయారుచేస్తారు. కొబ్బరి పీచుతో దృఢమైన తాళ్ళూ, చాపలూ, తడికలూ మొదలైనవి తయారుచేస్తారు. కొబ్బరిఆకులను ఇళ్ళకు కప్పుగానూ ఆకులలోని పుల్లలను చీపురులుగానూ ఉపయోగిస్తారు. కొబ్బరి బోదెలను గుడిసెలకు గుంజలుగానూ, వాసాలు గానూ ఉపయోగిస్తారు. కొబ్బరి చెట్టు మామూలుగా 25 మీ॥ ఎత్తు వరకూ పెరుగుతుంది. చెట్టు పెట్టిన మూడు నాలుగేళ్ళలో కాపుకు వస్తుంది. మంచి జాతికి చెందిన చెట్టు ఏడాదికి 300 కాయల వరకూ కాస్తుంది. వీటిని రెండు నెలల కొకసారి కోస్తారు.

### గర్భందాల్చే మగ నీటిగుర్రాలు!

అంతగా లోతు లేని సముద్ర జలాలలో నివసించే నీటిగుర్రాలు అనే అతిచిన్న ప్రాణులు చాలా విచిత్రమైనవి. చేపల్లాగా అడ్డుగా కాకుండా ఇవి నిలువుగా ఈదుతాయి. వీటి ముఖం చూడడానికి గుర్రంలాగా ఉంటుంది. రెండు కళ్ళతో అన్ని వైపుల కూచూడగలుగుతుంది. మగ నీటిగుర్రాలకు కడుపుకు కింద సంచీ వంటి భాగం ఉంటుంది. ఆడ



నీటిగుర్రాలు, మగ వాటిని సమీపించి ఈ సంచీలలో ఒక్కసారికి 200 గుడ్లు పెడతాయి. ఆ తరవాత అయిదు వారాలు మగ నీటిగుర్రాలే గుడ్లను కాపాడుతాయి. గుడ్ల నుంచి పిల్లలు వెలుపలికి వచ్చే సమయంలో ఆ సంచీమూత తెరుచు కుంటుంది. పిల్లలు బయటికి వచ్చేస్తాయి.

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1993 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.


M. Natarajan


T.C. Jain

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో :కలిసి ఆడేము మళ్ళీ! రెండవ ఫోటో : అలుకమానవే చెల్లీ!

పంపినవారు : శ్రీమతి పి. సుశీల W/o పి. చిన్నప్ప, గాంధీనగర్, ముషీరాబాద్, హైదరాబాద్-- 500 020.

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**

# "మెరిసే పాళీ మా గొప్పనేస్తం
# కేమ్లిన్ హోం వర్కు చేయవే తక్షణం."




బుల్లి పాషా రహస్యం — కేమ్లిన్ ఫౌంటెన్ పెన్నులు. ఉత్తమమైన వాటి పాళీల వల్ల చాలా మెత్తగా, త్వరగా వ్రాసేయచ్చు.

అందుకే బుల్లి పాషా హోం వర్కు అయిపోతుంది చిటికలో. మిగిలి పోతుంది, ఆడు కునేందుకు బోలెడంత సమయం.





**camlin**

మీ చేదోడు

Contract.Cl.922.93.Tl